262

# ఆర్యకథాలహరి

## ఆఱవ భాగము.




రచయిత:

టి. వి. నరసింగరావు,

బి.ఎ., యల్.టి.,

డి. ఐ. ఆఫ్ స్కూళ్ళు,

నంద్యాల రేంజి.



పబ్లిషర్సు:

రామా అండ్ కో.,

విద్యావినయైకప్రచారకులు,

తర్లపాడు, (నెల్లూరుజిల్లా).




[వెల రు 0—6—0

# రామకృష్ణజంత్రి.



ఇది 1, 2, 3 భాగముల వకేశైబెండు. ఇందులో ఎః సెంట్లకుగాని యెన్ని యెకరములకుగాని యే రేటులో కావలసి నను శిస్తు వివరముగా తెలుసుకొనుటకున్ను, యూనిట్ రేట్లకు కావలసిన వివరములున్ను, జీతములు, పెన్షనులు, యింటిఅద్దెలు మున్నగునవి యే నెలలో యెన్నిరోజులకు కావలసినను అప ్కిలి సులభముగా తెలిసికొనుటకు ఉపయోగకరమైన గ్రంథము. ఇది గ్రామ కరణములకును, మునసబులకును, రివిన్యూ ఆఫీసరులకును, తదితరులకును ముఖ్యముగా చేతియందుండదగినదై యున్నది. ఇటువంటి పుస్తకము యిది వరకెన్నడును యెవరును తయారుచేయించి యుండలేదు. కొద్దిప్రతులుమాత్రమే అచ్చువేయింపబడి యున్నవి. త్వరలో ఆర్డర్లు పంపినవారికే దొరకును.

వెల పుస్తకము 1కి రు 1—8—0 మాత్రమే.

# విషయసూచిక.

—:o:—

# ఆర్యకథాలహరి.

## ఆరవ భాగము.

### 1. సాధ్వీ విజయము.

మద్రదేశాధీశ్వరుండగు నశ్వపతి, సంతానార్థియై సావిత్రీ మహాదేవింగూర్చి తపంబుఁజేయ, నద్దేవి వరప్రసాదంబున నాన్నృపాలునకు మాళవియను ధర్మపత్ని యందొక పుత్రిక జనించెను. తల్లిదండ్రులా పుత్రికకు సావిత్రి యను పేరు పెట్టిరి. సావిత్రి దినదిన ప్రవర్ధమానయై సౌందర్యమునందు సురకాంతలకు మించియుండెను. కాలక్రమమున సావిత్రి సంప్రాప్త యౌవనయై యుండుటఁజూచి, యక్కన్నియను తగిన వరున కొసంగవలయునని తలంచి యుండఁగా, నశ్వపతికడ కొకనాఁడు నారదమునీంద్రుండరుదెంచి, సాళ్వపతియైనద్యుమత్సేనుని తనయుఁడగు సత్యవంతుని గుణగణంబులఁగూర్చి చెప్పెను. నారదుని మాటలు సావిత్రివిని, నాటినుండియుఁ దన చిత్తము సత్యవంతునిపై నిలిపెను. కాని సిగ్గుచే నెవ్వరికిని దెలుపకయుండెను.

ఇట్లుండ మఱియొక సమయమున నారదుండు మద్రేశ్వరునికడ కరుదెంచి, యాతనిచేఁ బూజలంది, సుఖాసీనుండై

యున్న సమయమున, నచ్చటికి సావిత్రి వచ్చెను. నారదుఁడు రాజేంద్రునిఁజూచి, "యుక్తవయస్కురాలగు సావిత్రికిఁకను పరిణయము సేయలేదే" మని యడిగెను. అప్పు డశ్వపతి కుమారిం జూచి "అమ్మాయీ! నీకు వివాహకాలము సమీపించినది. కావున నీగుణరూపవృత్తములకుఁ దగిన పతిని నీవే కోరుకొను" మనెను. సావిత్రి యందుల కొకింత సిగ్గుపడి తండ్రితో "నాచిత్తము సాళ్వపతి తనయుండగు సత్యవంతుని పైఁ జిక్కియున్నది. సాళ్వరా జిప్పుడు రాజ్యముఁ గోలుపోయి, యంధుఁడై భార్యాపుత్ర సహితంబుగ నరణ్యమున నున్నవాఁడు," అని పలికెను. సత్యవంతుని గుణాదులంగూర్చి మద్రపతి నారదు నడిగెను. నారదుం డిట్లనెను. "రాజేంద్రా! సకల సుగుణములును, బలపరాక్రమ ధైర్యసాహసంబులును సత్యవంతునియందు మూర్తీభవించియుండె ననుట కావంతయు సందియము లేదు కాని, యొక్క విషయము మాత్రము నీకుఁ జెప్పక తప్పదయ్యెను. వివాహమైనయొక సంవత్సరమునకాతఁడు మరణించును."

నారదుని వాక్యములు విన్నంతనే యశ్వపతి కేమియుఁ దోచక "సావిత్రీ! తల్లీ! ఇమ్మునీంద్రుఁడు సత్యముఁ బలికినాఁడు. అట్టివాని నేల కోరెదవు? ఇంకొకని వరింపు"మనిన సావిత్రి యిట్లనెను. "మనోవాక్కాయములను మూఁడింటి యందును నంతఃకరణము ప్రధానము. మనంబునఁ గోరిన

భర్తను మాని మఱియొకని వరించుట ధర్మము కాదు"- నారదుఁడు మద్రపతి నవలోకించి "రాజేంద్రా! నీపుత్రిక చిత్తమింక మరలదు. కావున నీవు నా సత్యవంతునకే యొసంగి వివాహము సేయుము. ఈమె సుకృతంబున నాతఁడు దీర్ఘాయుష్మంతుఁడగుఁ గాక!" యని పలికి యరిగెను.

తరువాత నశ్వపతి-సకల పురోహితామాత్య బృంద సమేతుఁడై, సావిత్రిం దోడుకొని, సాళ్వపతియున్న యరణ్యంబున కరిగి, యతనిచేఁ బూజితుఁడై, తన కోరికఁ దెల్పి, యాతని నొడంబఱచి, యొక శుభలగ్నమున సావిత్రిని సత్యవంతున కొసంగి పరిణయము జేసి, నిజపురంబున కరిగెను.

సావిత్రి దివ్యభూషణాంబరముల నుజ్జగించి, నారచీరెల ధరించి, యత్తమామల చిత్తంబులు రంజిల్లునట్లు సేవలు జేయుచు, భక్తిఁ బూని పతినిఁ గొల్చుచుండెను. నారదుని వాక్యంబు లనుసరించి యయ్యింతి పరిణయంబైనది మొదలు భర్తయాయుఃప్రమాణం బనుదినంబును లెక్క పెట్టుచుండెను. నాల్గుదినంబులు కొఱంతగా సంవత్సరము నిండెను. అప్పు డీమె త్రిరాత్రోపవాస వ్రతము బూనెను. మూఁడు దినంబులు గడచెను. నాల్గవదినంబునఁ బతికి మరణము గలుగునని యెఱింగి చింతించుచుఁ బరమేశ్వరుని ధ్యానించుచుండెను. ఆనాఁడు సత్యవంతుఁ డుసిరి తెల్లు, వన్యఫలములకై

యరణ్యమున కరుగ నున్న సమయమున సావిత్రి తన్నుఁ గూడఁ దోడ్కొని పొమ్మని యడిగెను. సత్యవంతుఁడు "తరుణీ! నీవు త్రిరాత్రోపవాస వ్రతమునను మిగుల బడలియున్న దానవు. నీ వాశ్రమంబున నుండుము. నేను సత్వరంబుగ నరుదెంచెద" ననెను. అందులకు సావిత్రి యతనికిట్లు పలికెను.

"మ. ఉపవాస శ్రమమించుకంతయును నా ♦ యుల్లంబునం దోపదీ
విపినంబుజ్జ్వల పుష్పపల్లవ ఫలా ♦ విర్భూతి నానాలతా
గపరీతంబన విందుఁజూడఁగ మదిం ♦ గౌతూహలంబయ్యెన
న్ను పరోధింపకు మింతవట్టుచన పీ ♦ యుక్తుండ వెభ్భంగు
లన్."

సావిత్రి రాకకు సత్యవంతుఁడు సమ్మతించెను. అత్తమామల యనుజ్ఞఁబొంది యా తరుణీమణి నాథుని వెంట నరణ్యమున కరిగెను. సత్యవంతుఁడు ఫలపుష్పంబులఁ గోసి సావిత్రి కొసఁగి, యొక యెండిన వృక్షము కడకరిగి, దానిం జీల్చుటకు మిగుల శ్రమనంది, గొడ్డలి నేలపైఁ బడవైచి, వాడిన మోముగలవాఁడై యత్తలోదరిని గాంచి "ఇంతీ! నాశరీరము నావశమగుట లేదు. నాశిరంబున శూలములచేఁ బొడుచుచున్నట్లున్నది. శ్రమవాయనొక్కింత విశ్రమించెద. ఒక్కనిమిషమైన నిలువఁజాల" నని పలుక, నాసావిత్రి తన యంకతలము నుపధానముగాఁ జేయ, సత్యవంతుఁడు వ్రాలి

నిశ్చేతనుండై యుండెను. అంతఁగొంతతడవునకు గాటుకవంటి
శరీరమును, ఘోరమై వాడిగల దంష్ట్రలును, రక్తచ్ఛాయఁ
బోలుకన్నులును, లోకమును గంపింపఁజేయు రూపమును
గలిగి హస్తమునఁ బాశముతో సత్యవంతుం గదిసిన యొక
పురుషుంగాంచి, సావిత్రి భయంబంది, నిజేశుని శిరమునంక
తలమునుండి నేలంబెట్టి, యాపురుషునకునమస్కరించి "అయ్యా!
మీరెవ్వరు? ఏమిపనికై యిచ్చటి కరుదెంచి"రని యడిగెను.
అప్పురుషుం డామెంగాంచి" తరుణీమణీ! నేను కాలుఁడ. నీపాతి
వ్రత్యమహిమంజేసి నన్నుఁగాంచఁగలిగితివి. అన్యులకు నేనగో
చరుఁడ. నీపతికిఁ గాలము సమీపించినది. ఈతఁడు పుణ్య
మూర్తియగుటచేత నితరులను బంపక నేనే యాతనిఁ గొనిపోవ
వచ్చితి" నని పలికి సత్యవంతుని దేహముననున్న జీవుని వెడలఁ
జేసి, దీర్ఘపాశ బద్ధుంజేసి, దక్షిణాభిముఖుఁడై పోవుచుండెను.
అంత సావిత్రి శోకమునందుచు, సత్యవంతుని దేహమొక్క
యెడ గుప్తంబుగావించి, యముని వెంట నేగుచుండఁ, నాతఁ
డామెం గాంచి "నీ వేల నావెంట వచ్చెదవు? ఇఁకముం దున్న
మార్గ మగమ్యము. నిలువు" మనెను. సావిత్రి "దేవా! పతు
లెచ్చటనున్న సతులుగూడ నచ్చట నుండుట ధర్మము. నీకరు
ణచేతను, నాపతిభక్తిచేతను నే నరుగలేని స్థలములు గలవే?
ధర్మమార్గమున కాలవాలమైన సజ్జనదర్శనము వృథయగునా!
నీదర్శనంబున నేను శుభంబులఁ బడయకపోవుదునా!" యని

వచింపఁ, గాలుఁ డామె వాక్యములకు సంతసించి, విభుని జీవితము తప్ప నొకవరము కోరుమని చెప్పెను. శత్రువులచే రాజ్యంబుఁ గోలుపోవఁబడి, యంధుఁడై యరణ్యముననున్న తన మామకుఁ గన్నులు వచ్చునట్లు సావిత్రి కోర, యముం డట్లనుగ్రహించి చనుచుండెను. యముం డామెను మరలి పొమ్మనిన నామె యతని కిట్లనెను. "మనోవాక్కాయకర్మంబుల నెవ్వరికిని హింససేయకుండుటయు, దీనులను గృపతోడఁ బ్రోచుటయు, నర్థుల యభీష్టములఁ దీర్చుటయు, నార్యజన ధర్మములై యొప్పుచుండును. నీ వెఱుంగని ధర్మములు లేవు. ధర్మస్వరూపుండ వగుటచేతనే నిన్ను ధర్మదేవత వనిరి. అఖిల జీవశ్రేణి కర్మఫలంబులను సమబుద్ధిం జూచువాఁడ వగుటం జేసి సమవర్తి వైతివి. భూతములను యమించువాఁడ వగుటం జేసి యముండ వనియుఁ, బాప శమనంబుఁ జేయువాఁడ వగుటం జేసి, శమనుండ వనియుఁ బేరు లందినాఁడవు.

శమనుఁ డామె మృదుమధుర గంభీర భాషణంబులకు సంతసించి, విభుని ప్రాణముదక్క మఱియొక వరముఁ గోరుకొనుమని యానతీయ, నాకాంత వైరులచే నపహరింపఁ బడిన తన మామగారి రాజ్యము మరలఁ గలుగు నట్లనుగ్రహింపుమని కోరెను. యముఁడా వరంబిచ్చి "ఇఁక నిలువు" మని చెప్పి యరుగుచుండెను. సావిత్రి యాతని వెంటఁ బోవుచుండ నాతఁడు సత్యవంతుని జీవితము తప్ప మఱియొక వరముఁ

గోరుకొనుమని చెప్పెను. మూఁడవవరంబున నామె తనతండ్రి శతపుత్రలాభము వడయున ట్లనుగ్రహింపఁబడి, యంతట నిలువక యముని వెంటనంటెను. యముండామెం గాంచి "నీవు కడుదూరం బరుదెంచి మిగుల డస్సితివి. ఇఁకమరలు" మనివచింప సావిత్రి యిట్లుపలికెను. "దేవా ! నాకాయాస మనునది యెక్కడ నున్నది? పతినివిడిచి పోవుటకు నాచిత్తము సమ్మతించునా! ఏడుమాటల నాడినచో నెట్టి వారును జుట్ట ములగుదురని యార్యులు పలుకుదురు. అట్టిచో బంధుజన మనోరథము దీర్చుట నీకవశ్యకర్తవ్యమై యున్నది."

సావిత్రి పలుకులకు సంతసించి సమవర్తి యామెం గాంచి "రమణీ ! నీపలుకులు నాకుమిగుల మోదముఁ గలిగించినవి. నీవింకొక వరము గోరుకొను" మనెను. అతఁ డీసారి "సత్యవంతుని జీవితము తప్ప"యనుమాట మఱచి పోయెను. అప్పుడు సావిత్రి యపరిమితానందమును బొంది,

"చ. పతివిరహంబుదుస్సహము♦భర్తృవినాకృతయైనకాంతదూ
షితయగుసర్వమంగళవి♦శేషములందునుగానమత్ప్రియుం
డతు లితకీర్తిశాలిసుగు♦ణాఢ్యుఁడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపద ♦ నీపరిరక్షణ పుణ్యవీక్షణా."

అని యడిగెను. శమనుం డామె కోరినట్ల నుగ్రహించి చనెను. సావిత్రి పరమ సంతోషము నందుచు సత్యవంతుఁ

దున్న స్థలమునకు వచ్చునప్పటికి నాతఁ డంతకుమున్నే లేచి యామె నరయుచుండెను. సావిత్రి జరిగినదంతయుఁ బ్రాణేశ్వరున కెఱింగించెను. అంత నయ్యిరువురును నాశ్రమంబునకు వచ్చునరికి సాళ్వపతి యంధత్వము తొలఁగి సావిత్రీ సత్యవంతు లింకను రాలేదని చింతించుచుండెను. సత్యవంతుఁడు సతీసహితముగాఁ దల్లి దండ్రులను జేరి జరిగిన వృత్తాంతమంతయు నెఱింగించెను. వైరులు గెలిచిన రాజ్యము మరల ద్యుమత్సేనుఁడు గాంచఁ గలిగి, సకల పౌరులకును నానందమొదవునట్లు సత్యవంతునిఁ బట్టాభిషిక్తుఁ జేసెను.

---

## 2. పరీక్షిత్తు.

భారతయుద్ధమున భీమునిచేఁ దొడలు విఱిగిపడియున్న దుర్యోధనునకుఁ బ్రియముసేయ, నశ్వత్థామ నిద్రావస్థనున్న ద్రౌపదీసుతులను వధించెను. ద్రౌపదేయుల మృతిఁజూచి, పాంచాల రాజపుత్రి బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చుచుండ; నర్జునుం డామెను డాసి,

“శా. ధరణీశాత్మజ నీకు నిట్లువగవన్ ♦ ధర్మంబె యా ద్రోణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల, మ ♦ ద్గాండీవనిర్ముక్తభీ
కరబాణంబుల నేఁడు వానిశిరమున్ ♦ ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరమున్ ద్రొక్కి జలంబులాఁడు మిచటన్ ♦ శీతాంశు
బింబాననా!”

అని చెప్పి గాండీవధారియై రథంబెక్కి, యశ్వత్థామ నన్వేషించుచుఁ బోయెను. ద్రోణసుతుఁడు తనకై యర్జునుఁడు వచ్చుచున్నాఁడని విని, ప్రాణభయమునఁ బాఱఁదొడంగెను. అర్జునుం డాతని వెన్నంటిపోవ, నాతఁడు ప్రాణరక్షణమునకు మార్గమును గానక, యర్జునునిపై బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించెను. అప్పు డర్జునుఁడు కృష్ణుని యనుమతంబున బ్రహ్మశిరముపై బ్రహ్మాస్త్రమునుఁ బ్రయోగించి, యశ్వత్థామను బట్టుకొని, బంధించి, ద్రుపద రాజపుత్రికకడకుఁ దీసికొని వచ్చెను. అశ్వత్థామ ద్రౌపది మొగంబుఁజూడలేక తలవంచుకొని నిలిచియుండెను. అప్పుడు ద్రౌపది యాతనిం గాంచి "ద్రౌణీ! భూసురుఁడవగు నీకు శిశుమారణకృత్యముతగునా!

శా. ఉద్రేకంబున రారుశస్త్రధరులై ♦ యుద్ధావనిన్ లేరు, కిం చి
ద్ద్రోహంబును నీకు సేయరు బలో ♦ త్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ బిన్నపాపలరణ ♦ ప్రౌఢక్రియా హీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా! ♦ నీచేతులెట్లాడెనో!"

నేను నా తనూభవులఁ గోలు కేడ్చుచున్నటులే, సన్నిట్లర్జునుఁడు బంధించి తెచ్చెనని విని నీతల్లి యెంతయడలుచున్నదో"! యని పలికి కృష్ణార్జునులఁజూచి "ద్రోణునితో సగ్నిబడక యాతని కుటుంబిని యింటనున్నది. ఈతఁడు ప్రాణముఁ వాసిన మనకుఁ బాపము సంభవించును. భూపాలురు విప్రు

లను గోపింపరాదు. ఈతని విడచిపెట్టుఁ" డనెను. అందుల కండఱును సమ్మతించిరికాని భీముఁడు మాత్రము వానిని జంపి తీరవలయు ననెను. ద్రౌపది యాతనినివారించెను. అర్జునుఁ డశ్వత్థామ శిరోజములఁ దఱిగి, యాతనిశిరోరత్నమును గ్రహించి, పాశవ్రాతము లూడ్చిపుచ్చి విడిచిపెట్టెను.

"జగము పాండవ మగుఁగాక" యని యంతకు మున్న శ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామ కాస్త్రము ఉత్తర గర్భమును బాధింపఁగాఁ బాండవక్షేమం కరుఁడగు కృష్ణుఁ డాయస్త్రమును వారించి యామెను రక్షించెను. కాని యా బాణముయొక్క వేడిమి మాత్రమామె యుదర గోళమును విడువ దయ్యెను. ఉత్తరకుఁ బదియవ మాసము వచ్చెను. గర్భమునందున్న శిశువు ద్రోణనందనుని యస్త్రానల జ్వాలలఁగంది హరిని వేడుకొనుచు "నేను బహిర్గతుఁడఁగా కున్నచో దుర్భరగర్భవేదనచే మాతల్లి చచ్చును. మున్ను బాణాగ్ని వారించి మాతల్లిని రక్షించిన వాసుదేవుఁ డిప్పుడు నన్ను రక్షింపఁడా!" యని చింతించుచుండెను. అప్పుడు కృష్ణ భగవానుఁ డా శిశువున కెట్టి భయముగలుగకుండ రక్షించెను. తదపడి యొక శుభదినమున నుత్తర కుమారునిఁ గాంచెను. అతఁడే పరీక్షిత్తు. పాండవవంశ దీపకుఁడగు నక్కుమారుని యుదయమునకు ధర్మరాజాదు లెంతయు సంతసించిరి.

పరీక్షిత్తునకు యుక్తవయస్సు వచ్చిన తరువాతఁ బాండవులాతనిని రాజ్యాభిషిక్తునిఁ జేసి మహాప్రస్థానమున కరిగిరి. పరీక్షిత్తుఁడు హస్తినాపుర సామ్రాజ్యాధిపతియై, నిరంకుశముగ ధరాచక్రమేలుచు, దిగ్విజయార్థము బయలుదేరి, వివిధ ప్రదేశములఁ జరించుచు నొక్కనాఁడు సరస్వతీ నదీతీరమున కరిగెను. ఆసమయమున వృషభరూపమున నొంటికాలుతోఁ జరించుచున్న ధర్మదేవత,గోరూప ధారిణియై యున్న భూదేవితో సంభాషించుచుండెను. అప్పుడు రాజలక్షణ లక్షితుండును, భయంకర స్వరూపుఁడును, దండహస్తుఁడు నగు శూద్రుం డొకఁడు తొందరగావచ్చి,యాగోవృషభంబులఁ దన్నియిడ్వఁ దొడంగెను. ఇది యంతయుఁ గాంచుచున్న పరీక్షిత్తుఁడు వానిని సమీపించి, మేఘ గంభీర వాక్యంబులతో.

"శా. నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో కదిసెనో♦నిర్భీతిమైగోవు లం
దన్నుం గారణమేమి, మత్స్యజననా♦థక్షోణి నేవేళ లం
దాన్నేరంబులు సేయరాదెఱుఁగవా♦ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబులొనర్చెదెవ్వఁడవునిఁ♦శాసించెదన్ దుర్మతీ."

నాపితామహుఁడగు నర్జునుఁడును, నతని మఱఁది యగు వాసుదేవుఁడును, ధరాతలము నెడఁబాసి చనిరికదా యని నీవు దుర్మదవృత్తినిఁ బూని చరించుచు, మాన్యుల నవమానించుచున్నావు. నిన్నిప్పుడే శిక్షించెదఁగాక" యని, వృషభ

మూర్తియై యున్న ధర్మదేవతను విలోకించి "ఓ గోమూర్తీ! నీవు చింతింపవలదు. ఈ వృషలుని దండించి నిన్ను నాలుగు పాదముల నడిపించెద"నని వచించెను. గోరూపిణియై యున్న భూదేవితో "నిన్ను బహువిధముల రక్షించి మించిన మధుసూదనుఁడు లేడని కుందవలదు. సాధువులకు బాధలు గలిగించు ఖలుల భంజింపని రాజు బ్రదుకు వ్యర్థము. దుష్టజననిగ్రహమునకును, శిష్టజనానుగ్రహమునకును రాజులను బ్రహ్మ సృష్టించినాఁడు" అని పలికి, యాగోవృషభంబుల బుజ్జగించి, యొరనుండి ఖడ్గము దీసి తన యెదుటనున్న వృషలునిఁ జంపఁ బోవ, నాతఁడు భయకంపితశరీరుఁడై పరీక్షితునకు వందన మొనర్చి "మహారాజా! ధగధగద్ధితమగు నీ ఖడ్గముఁ జూడ నాకు భయ మొదవుచున్నది. నన్ను వధింపవలదు. రక్షింపు" మని వేఁడెను. ఆర్తరక్షణకళాపారీణుఁ డగు పరీక్షితుఁడు తన ఖడ్గమును మరల నొరఁబెట్టి యతనిని గలిపురుషునిగాఁ గ్రహించి "ఓయీ! నీవు పాపబంధుఁడవు. నాచేఁ బాలింపఁబడు భూమండలంబున నీవుండరాదు. అసత్యలోభచౌర్యదౌర్జన్యదురాచారములగు నధర్మములుండు స్థలములందే నీవుండవలయును. కావునఁ బ్రాణివధ, స్త్రీ, ద్యూతపానంబులనెడు ప్రదేశములందు ధనమూలకములగు నసత్యమదకామహింసావైరంబులు గలిగించుచు నుండు"మని యాజ్ఞాపించి, వానిని విడిచిపెట్టెను. ధర్మదేవతయు భూదేవియుఁ బాండవపౌత్రుని ధర్మవిరతికి సంతసించిరి.

పరీక్షిత్తుఁ డట్లు కలిని నిగ్రహించి, రాజధానిం జేరి సుఖముగా రాజ్యము సేయుచు నొక్కనాఁ డరణ్యమున కేగి, వేఁటాడి యలసి, దాహపీడితుఁడై యందందుఁ దిరుగుచు, నొకచోట శమీకుం డనుమునీంద్రునిఁ గాంచెను. ఆసమయంబున నాఋషిపుంగవుఁడు నిమీలితలోచనుఁడై తపస్సుఁ జేసికొనుచున్నందున రాజును పలుకరింపలేదు. పరీక్షితుఁడు తనచిత్తమున "దాహపీడితుఁడనై వచ్చిన నన్నీయోగి గౌరవింపక యున్నాఁడు. మునులకింత గర్వమా! అతిథిపూజ వలదా" యని తలంచి, యాసమీపమునఁ గనఁబడిన యొక మృత సర్పమును దెచ్చి, యాతని కంఠమున వేసి పోయెను. కుశఫలాదులకొఱ కరణ్యమునకుఁ బోయి యున్న శమీక పుత్త్రుండగు శృంగి, మునికుమారులవలన నాసంగతివిని, తత్క్షణమె వచ్చి, తండ్రిమెడయందున్న మృతసర్పమునుజూచి, యాగ్రహాపర వశుఁడై" సర్పశవమును దెచ్చి మదీయ జనకుని గళమున వైచిన యారాజేంద్రుఁడు నేటి కేడవ దినంబున హరిహరు లడ్డమైనను దప్పక తక్షకమహా సర్పదష్టుఁడై మృతి నందుఁగాక" యని శపించెను. అంతలో శమీకుఁడు తపస్సు జాలించి కన్నులు తెఱచిచూచి, భుజమున వ్రేలుచున్న మృతోరగమునుదీసి పాఱవైచి, తన కుమారుఁడు పరీక్షితుని శపించిన విధం బెఱింగి మిగుల విచారించుచుఁ గొడుకున కిట్లనెను. "వత్సా! సర్పవిషాగ్ని జ్వాలల గ్రస్తమని రాజున

కేల శాపంబిచ్చితివి? ఆతఁడు తల్లికడుపులో దగ్ధుఁడై, వాసుదేవుని కరుణచే బ్రదికి, మనకుఁ బాలకుఁడై ధర్మము ననుసరించి, రాజ్యముఁ జేయుచున్నాఁడు. రాజు లేకున్నచో రాష్ట్రమునందు బలవంతులు బల హీనులను బాధింతురు. జారచోరాది బాధలు వృద్ధియగును. వర్ణాశ్రమాచారధర్మంబులు నశించును. ప్రజలలో నన్యోన్య కలహములు ప్రబలును. వర్ణసంకరము సంభవించును. భరతకులీనుఁడును, నాచారపరుఁడును, నీతివిశారదుఁడు నగు నతఁడు సలిలార్థము మన యాశ్రమమునకు వచ్చినప్పుడు సత్కారముఁ జేసి పంపుటకు మారుగా శాపమిచ్చితివా!" యని పలికి, యాశాపమును ద్రిప్పుటకు శక్తుఁడు గాక యావృత్తాంతముఁ బరీక్షితున కెఱింగించి వచ్చుట కొక శిష్యునిఁ బంపెను.

శమీకుని శిష్యుఁడు పరీక్షితుని కడ కేగి శృంగిశాపము నెఱింగించెను. నృపాలుఁ డదివిని "అక్కటా! వేఁటకేలపోయితిని! గాఢసమాధియందున్న శమీకుని మెడను మృతసర్పమేల వైచితి! దైవయోగము నెవ్వరు దాటఁగలరు! రాజ్యగర్వమున నింతపనిఁ జేసితిని. గో బ్రాహ్మణులను, మునిదేవతలకును నెగ్గుచేసినవారిని బాపముచుట్టుకొనక యుండునా"! యని వగచి, ధైర్యము వహించి, యిహలోకసౌఖ్యముల రోసి, విరక్తుఁడై కుమారుఁడగు జనమేజయునకు రాజ్యాభిషేకముఁ గావించి, గంగాతీరమున కేగి ప్రాయోపవిష్టుఁడై యుండెను.

పరీక్షితుని శాపవృత్తాంత మెఱింగి, మహానుభావులగు మునీం ద్రులెందఱో యాతని కడకు వచ్చిరి. పరీక్షితుఁడు వారికి నమస్కరించి, యేడుదినములలోఁ దనకు ముక్తి కలుగు మార్గ ముపదేశించి రక్షింపుఁడని కోరెను.

మునీంద్రు లాతని కిట్లుపలికిరి.

"ఉ. ఏనుమృతుండ నౌదునని ♦ యింతభయంబు మనంబు లోపలన్
మానుము సంభవంబుగల ♦ మానవకోట్లకుఁ జావునిత్యమౌ
గాన హరిందలంపు మిఁకఁ ♦ గల్గను జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు ♦ మాధవలోక నివాససౌఖ్యముల్.

పరీక్షితుఁడు మునిజన ప్రబోధితుఁడై యితర చింతలు విడిచి, తన చిత్తము శ్రీహరియందుఁ జేర్చియుండెను. మును లెల్లరు నాతనికి హరికథలు వినిపించుచుండిరి. అంతసప్తమ దివసంబున శృంగిశాపము ననుసరించి, తక్షకుఁడు పరీక్షితు నంతంబందింప బ్రాహ్మణరూపమున వచ్చుచుండెను. ఆ సమయమునసే సర్పవిషహరణ సమర్థుఁడగు కశ్యపుండను నొక బ్రాహ్మణుఁడుకూడ, బరీక్షితుఁడు సర్పదష్టుఁడైనచోఁ దన మంత్రశక్తిచే నాతనికి సుఖంబుఁగూర్చి యపరిమిత ద్రవ్యము గైకొనఁదలంచి పరీక్షిన్నికటంబునకుఁ బోవు చుండెను. ఈయిరువురును మార్గమధ్యమునఁగలిసికొనితమవృ త్తాంతములు పరస్పరము చెప్పికొనిరి. తక్షకుఁడు కశ్యపుని

మంత్రముఁ బఠించి "బ్రాహ్మణోత్తమా! పరీక్షితునకు శృంగి శాపమిచ్చినాఁడు. ఆశాపమునకుఁ గడువునేడే. నేనెట్లయిన నాతనిం గాపాడవలయును. నీచేనాతఁడు సజీవుఁ డయ్యెనేని మునిశాపమునకు భంగమొదవును. తాపసుల వాక్యము మిథ్యకాఁగూడదు. నీకుఁ గావలసినంత ధనము నేనిచ్చెద. దీనింగ్రహించి నీవు గృహంబునకు మరలిపొమ్ము" అనిపలికి, యాతనికపరిమిత ధనమిచ్చి పంపివేసెను.

పిదప, మునీంద్రులచేఁ బరివేష్టింపఁబడియున్న పరీక్షితునికడకుఁ దక్షకుఁడు బ్రాహ్మణవేషముతో వచ్చి యొక ఫలము నాతని కిచ్చి చనెను. ఆఫలమును రాజేంద్రుఁ డాస్వాదింప, నందుండి ముందుఁ గ్రిమిరూపమునవచ్చి, తరువాత మహాభయంకరోరగమై యాతనిం గఱచి యదృశ్యమయ్యెను. పరీక్షితుఁడు వెంటనే మృతినందెను. ఆతని మృతికి-సకల దేవతలును-మునులును జింతించిరి.

---

# 3. తేజోనిధికి వయసు కారణమగునా?

లోకమున మానవుఁడు యశము నార్జింపవలయుననిన ననేకమార్గము లున్నవి. దానధర్మము లాచరించి యొకఁడు పేరు గాంచును. దేశసేవకై పాటుబడి యొకఁడు యశము నార్జించును. రాజభక్తి తత్పరుఁడని యొకఁడు వినుతిఁగాంచును. మాతృపితృపూజారతుఁ డని యొకఁడు ప్రఖ్యాతికెక్కును. మహా

వీరుఁడని యొకఁడు ప్రతిష్ఠనందును. జననీజనకులు తమకుమా రుని ధైర్యవంతునిగను, ధర్మతత్పరునిగను, రాజభక్తునిగను, దేశోద్ధారకునిగను, వీరునిగను చేయవలయునన్నచో వానికి మహాపురుషుల చరిత్రములను జెప్పుచు, సద్గుణ బీజములను హృదయక్షేత్రములందు నాటవలయును.

లోకఖ్యాతిఁగన్న మహాపురుషులు దేవతలచేతఁ గూడ సన్నుతింపఁబడుదురు. అట్టివారిలో నభిమన్యుఁడొకఁడు. ఈతఁడు పాండవ మధ్యముఁడగు నర్జునునకుఁ గృష్ణ సహోదరియగు సుభద్రయందు జనించినాడు. పాండవుల వనవాసకాలమున నాతఁడు మేనమామల గృహమునందేయుండి సమస్తశస్త్రాస్త్ర విద్యల నభ్యసించెను. మత్స్యదేశాధీశుఁడగు విరటుని పుత్రిక యైన యుత్తరను, బలరాముని పుత్రికయగు శశిరేఖను వివాహ మాడెను. భారతయుద్ధములో నీతఁడు చూపిన శౌర్యము వర్ణనాతీతమైనది. బ్రదికినది కొలదికాలమైనను నీబాల వీర శిఖామణి వీరచరిత్రము ప్రతి మానవునికి యద్భుతము గొల్పక మానదు.

భారతరణమున నొకనాడు పాండవుల పరాక్రమము నకు భీతిల్లి కురుసేనలు నలుదెసలఁ బరుగిడఁ దొడంగెను. అప్పుడు దుర్యోధనుఁడు ద్రోణాచార్యుని సన్నిధి కరుదెంచి "గురువరా! నీవు నాకొసంగిన వరమును మఱచిపోయితివి కదా! వీరాగ్రేసరుఁడవు; నస్త్రవిద్య విశారదుఁడవునగు నీవే

పతినకు భంగమొనర్చిన నేమనఁగలవాఁడ? ధర్మజుని బట్టి తెచ్చెదనని నాకు బాసచేసితివి. అయిన ప్రయోజనమేమి యున్నది?" యనిపలికెను. ద్రోణుండందులకు "రాజేంద్రా! కృష్ణుని ప్రభావమును, నర్జునుని పరాక్రమమును దెలిసి యుండియు నిట్లేల పలికెదవు? నాశక్తి కొలఁది నేను రణం బొనర్చుచుంటిని. అభిమన్యుని శౌర్యపరాక్రమములఁ జూచితివి కదా. అర్జునునికంటె నెక్కువవాఁడై మనసైన్యముల పాలిటికిఁ గాలుఁడయ్యెను. అయినను పార్థుని వేఱొక చోటికిఁ గొనిపోవుటకు యత్నము సేయుము. అట్లు నీ వొనర్చితివేని నే నెట్లయిన ధర్మనందనునిబంధించి నీముందుఁ బెట్టెద" ననెను.

ఆమఱునాడు దుర్యోధనుని ప్రేరేపణంబునఁ దిగర్త దేశాధీశ్వరుఁడగు సుశర్మ - యర్జునుని రణంబున కాహ్వానించి దూరముగాఁ గొనిపోయెను. ద్రోణుఁడు ధర్మరాజుం బట్టు కొనుటకుఁ బద్మవ్యూహమును బన్నెను. ఆవ్యూహమునకు నానాదేశాధీశులును దళములై నిలిచిరి. దుర్యోధన కర్ణ దుశ్శాసనులు బహుళసేనాపరివృతులై యుండిరి. ఆ వ్యూహ ముఖమునకు ముందు ద్రోణుఁడు దర్పించి నిలిచియుండెను.

తన్నుఁబట్టుటకు ద్రోణాచార్యుఁడు పద్మవ్యూహమును బన్నెనని ధర్మరాజునిని, మిగుల భయంబంది, శిబిరమునందే యుండెను. ద్రౌపది యాతని విచారమెఱింగి "మహారాజా!

అభిమన్యుఁ డసమాన పరాక్రమవంతుఁడు. ఆతఁడీ వ్యూహ మును భేదింపఁగలుగుటయే గాక బ్రహ్మయే కౌరవుల పక్షమున నిలిచి మఱియొక వ్యూహమును బన్నినను భేదింపఁ గలఁడు. కావున నా కుమారునిఁ బంపుఁ" డని వచించెను. అభిమన్యునకుఁబద్మవ్యూహము భేదించి, లోపలఁ బ్రవేశించుట తెలియునుగాని, మరల నీవలకు వచ్చుట యెఱుంగఁడు. ఇదియుంగాక అర్జునుఁడు సంశప్తకులమీఁదకుఁ బోవునపుడు కుమారుని నెచ్చటికిని బంపవలదని చెప్పెను. అందుచే ధర్మ జుఁడు సందియమందెను కాని యెట్టకేలకుఁ బంపనిశ్చయించెను. అప్పుడు శల్యునితో యుద్ధము చేయుచున్న యభిమన్యుని దోడ్కొనివచ్చుటకు యుధిష్ఠిరుఁడు భీమునిఁ బంపెను.

మద్రపతితోడఁ బోరాటమును మానిపించి భీముఁ డభిమన్యుని దోడ్కొనివచ్చెను. అభిమన్యుఁడుధర్మసుతునకుఁ నమస్కరించి, తన్నుఁబిలువబంచిన కారణ మానతిమ్మని వేడెను. యుధిష్ఠిరుఁ డకుమారుని కౌఁగలించుకొని నెమ్మ దిగా నిట్లుపలికెను. ,,నాయనా! సౌభద్రా! నీవు పసివాఁడ వయ్యును, రిపుజనభయంకరుడవై యొప్పుచున్నందుల కెంతయు సంతసము. నా యానతిఁ దప్పక చేయుదువని నిన్ను రావించితిని. త్రిగర్తేశ్వరుఁడు యుద్ధముసేయుటకుఁ బిలువ నీతండ్రి యరిగి నాడు. ఇదియేసమయమని ద్రోణుఁడు నన్నుఁబట్టుటకుఁ బద్మ వ్యూహమును బన్నినాడు. కృష్ణార్జునులు సంగరమున లేనిచో,

ధర్మనందనుని గురుండుపట్టునను దుర్యోధనునియాశ నీవు రిత్త చేయవలయును."

భీముండిట్లనెను. "కుమారా! భరతకుల రత్నదీపా! పద్మవ్యూహభేదనమునకు నిన్నుఁదప్పక పంపవలసివచ్చినది. నేను రణరంగమున గదను ధరించి శత్రువుల శిరములఁ బిండి యగునట్లు మర్దించుటే కాని, యిట్టి వ్యూహముల నిర్మించుట గాని, భేదించుటగాని యెఱుంగను. నీవెట్లయినను నా ముగ్గరమునకు సూదిపట్టునంతటి మార్గముఁ జేసితివేని మేమందుఁ బ్రవేశించి వ్యూహమును చీలదీసి రిపులఁ జెండాడెదము."

నకులుం డిట్లువచించెను. "నందనా! ఇక్కార్యమునకు మేము శక్తులముగామని చెప్పుటకు సిగ్గగుచున్నది. నీవెట్లయిన ముగ్గరములోనికిఁ బ్రవేశించుటకు మాకు మార్గముఁజూపి, మేము శూరులమను మాటకు భంగమురాకుండఁ జేసి, కుంతి కంటెఁ గోడలగు సుభద్రయె వీరమాతయను కీర్తిఁదెమ్ము. ఇదియుంగాక నీయందు గురునకు వాత్సల్యమధికము. రణమున నీపై వాడిశరములఁ బ్రయోగింపఁడు."

సహదేవుం డిట్లునుడివెను. "వత్సా! అర్జునుం డిచ్చట లేని వెలితిఁదీర్చి తామర ముగ్గరముజించి మాకీర్తి నిలుపుము. మేమును నీ వెనువెంట నేయుండి కాపాడుచుందుము. ఇంతలో

షంశ ప్రభులఁ గెలిచియర్జునుఁడు రాగలఁడు. నీ వీ కార్యముఁ జేసి ధర్మనందనుని గాపాడవలయును."

తండ్రిలవాక్యము లాలించి యభిమన్యుఁడు "తండ్రి లారా! ఈస్వల్పకార్యమునకై మీరు నాకింతగాఁ జెప్పవల యునా! ఆకలిఁగొన్న సింగము హరిణపంక్తిపైఁబడురీతి నే నా కౌరవరాజ సైన్యముపైఁబడి పద్మవ్యూహమును భేదించి వచ్చెద"ననెను. ధర్మజుఁడు "కుమారా! నీతండ్రియు, మేన మామయు నిచ్చటలేరు. నీవు చేయఁబోవునది గురునితో యుద్ధము. నీభార్యయగు నుత్తర గర్భవతి. సుభద్రకునీవొక్క డవే పుత్రుఁడవు" అనిపలికి యాశీర్వదించెను.

అంతట నభిమన్యుని యానతిని, సుమిత్రుఁడు రథముఁ దెచ్చెను. ఆతఁడు దాని నారోహించి సమరమునకు వెడలెను. ధర్మరాజుతమ్ములను జూచి "అభిమన్యుఁడు పద్మవ్యూహమును భేదింపఁబోయినాఁడు. భుజబలపరాక్రమవంతులైన మీరందఱు నాతని కూతముగానుండి, ముగ్గరమునుజించినవెంటనే యుంను ప్రవేశించి, రిపులఁగూల్చి, కుమారున కేవిధమైనహానియు గలుగకుండఁ దోడ్కొనివచ్చి సుభద్రకప్పగింపుఁ"డనిపలికెను. భీమాదు లభిమన్యునకు సహాయముసేయుట కరిగిరి.

కౌరవయోధులెల్లరును ధర్మరాజు ద్రోణునకుఁ దప్పక చిక్కునని సంతోషించుచుండిరి. ద్రోణుఁడు రెండవముద్రిని

చందమున వెలుంగుచుండెను. అట్టి సమయమునఁ గుమార
వీరకంఠీరవుఁడగు నభిమన్యుఁడు సారథినిఁ దొందరపెట్టుచు వచ్చి,
కురుసైన్యమును కలిసి, యెక్కడఁజూచిన నక్కడఁ దాను
కన్పట్టుచు, నెవ్వరికిని నెదిరింప శక్యముగాక చరించుచు, విక్రమ
విహారమునకుఁ గడంగెను. కొంతసేపటి కాతఁడు పద్మవ్యూహ
మును జొచ్చి, యది చిక్కువడి, విచ్చి, కలంగి పోవునట్లు
చేయుచుండెను. అట్టిసమయమునదుర్యోధనుఁ డాతనిం దాకెను.
ద్రోణుఁ డది చూచి, రాజున కపాయమొదవునని కర్ణాది
యోధుల నాతనికి సహాయార్థముగఁ బంపి, తానుగూడ
నాదెసకరిగెను.

కర్ణాది వీరులందఱును నొక్కపెట్టున సౌభద్రుని దల
పడిరి. అతఁ డొకింతయుఁ జలింపలేదు. వా రాతని బాణవర్ష
మున కాగలేక పరుగిడిరి. ద్రోణుఁడు కర్తవ్య మూహించు
వాని వడువున నక్కుమారుని బాగడఁదలఁచి, కృపాచార్యుని
విలోకించి "అభిమన్యుని పరాక్రమముఁ జూచుచుంటివా!
నాకే భయముఁ గొలుపుచున్నాఁ"డని పలికెను.

దుర్యోధనుఁడు ద్రోణునికడకుఁ బరుగెత్తుకొనివచ్చి
"ఆచార్యా! అభిమన్యుని యస్త్రానలజ్వాలల కెవ్వరును
దాళజాలక యున్నారు. ఇట్లు నీ వూరక యుంటివేని మన సైన్య
మంతయు భస్మమగు" ననెను.

వ్యూహామున కావల భీమసేనాదులుండిరి. అభిమన్యుఁడు గేసిన మార్గము ననుసరించి, వారు లోనికిఁ బ్రవేశించి యాతనికి సహాయము సేయుటకుఁ బ్రయత్నించుచుండిరి. పద్మ వ్యూహామును బ్రవేశింపనున్న భీమాదులను, సైంధవుఁడు కడు రయమున వచ్చి నిలువరించెను. ఈ సైంధవుఁడు, పూర్వము పాండవులు వనంబున నున్నప్పుడు వారిచేఁ బరాభవింపఁబడి శివునిఁ గూర్చి తపమాచరించి, యొక్కదినమున నర్జునుని దప్ప దక్కిన నలువుర నోర్చునట్లు వరము గాంచెను. ఆ కారణము చేతనే యతఁడు నేడు భీమాదుల నడ్డగింపగలిగెను.

అభిమన్యునిఁ దాకి కర్ణ సూనుండగు వృషసేనుఁడు మూర్ఛిల్లెను. శల్యసుతుఁడు గతించెను. దుర్యోధన సుతుఁ డగు లక్ష్మణుఁడు మడిసెను. కర్ణుఁడు సౌభద్రు నెదుట నిలువఁ జాలక ద్రోణునిఁ జేరి "ఆచార్యా! నే నర్జునునితోఁ బోరి యుంటినిగాని యాతని కంటె నీతఁ డెక్కువవాఁడని తోఁచు చున్నది. ఒక్కఁడే మనలను గలచి వేయుచున్నాఁడు. ఇకే మన మూరకున్నచోఁ బ్రాణములు దక్కవని తోఁచుచున్నది" యనెను. "కర్ణా! అభిమన్యుని శౌర్య మపారమైయున్నది. చేతఁ జాపమున్నంతవఱ కాతని నెవ్వరును గూల్పఁజాలరు. కావున నొకఁడు చాపము దుంచవలయును. వేఱొకఁ డశ్వ ములఁ గూల్పవలయును. మఱొకఁడు రథము నుగ్గుసేయవల యును. ఇట్లొనరించి, యందఱును గలిసి యాతనిం దాకి

వలయు"నని ద్రోణుండు చెప్పెను. ద్రోణుండు చెప్పినట్లు వారొన ర్చిరి. భీమాదులు లోపలికి రాకుండ సైంధవుం డరికట్టెను గదా! అభిమన్యుఁడు కౌరవయోధులచే ముట్టడింపఁబడి, రథము పోయిన మఱియొక రథమును; విల్లుపోయిన మఱియొక విల్లును, దెచ్చువాఁడు లేక యసహాయుఁడై యుండెను. ఆతఁ డిఁక జీవింపనని నిశ్చయించుకొని, తన పరాక్రమ మింకను కౌరవయోధులకుఁ జూపఁదలఁచి గదఁ బూని ఘోరముగాఁ బోరుచుండెను. అప్పుడు దుశ్శాసన సుతుఁ డాతనితో గదా యుద్ధమునకుఁ గడఁగి యతిఘోరముగాఁ బోరెను. ఇరువురును బోరునప్పు డొకరి గదాప్రహారము లొకరికిఁ దాకి యిరువు రును మడిసిరి.

బాలుఁడయ్యును, మహావీర శిఖామణియై, మహా యోధుల కభేద్యమైన పద్మవ్యూహమును నొంటిమై యనా యాసముగ భేదించి, యతిరథమహారథుల నెల్ల డిల్లపడఁజేసి సంగర రంగమున నల్లకల్లోలము గావించి, తేజోనిధికి వయసు కారణముగునే! యనునట్లు శైశవమునందె. యాచంద్రతారక మైన కీర్తి నార్జించి, నిర్జరలోకమున కేగిన యా యభిమన్యుని చరిత్రము విన్న నెవ్వని మేనఁ బులకలు వొడమక యుండును.

# 4. ప్రతాపరుద్రుఁడు.

కాకతీయాంధ్రచక్రవర్తి యగు గణపతిదేవునకుఁ బుత్త్ర సంతానము లేకపోవుటచే, నాతని యనంతరమునఁ బుత్త్రికయైన రుద్రమదేవియే రాజ్యభారమువహించెను. ఆమె త్రిలింగ సామ్రాజ్య పరిపాలనము సమస్తజనులచేఁ గొనియాడఁబడెను. ఈమెకుఁ బుత్రసంతానములేదు. ముమ్మడమ్మ-రుయ్యమ్మలను నిరువురు పుత్త్రికలు మాత్రము కలరు. ఇందు ముమ్మడమ్మ చాళుక్యవంశోద్భవుఁడైన వీరభద్రరాజున కిచ్చి వివాహము సేయఁబడెను. రుయ్యమ్మను నిందులూరి అన్నమదేవ భూపాలున కిచ్చి పెండ్లిజేసెను. ముమ్మడమ్మకుఁ బ్రతాపరుద్రుఁడు-నన్నమదేవుఁడు నను నిరువురు పుత్త్రులుదయించిరి. రుయ్యమ్మకు సంతతిలేదు. ప్రతాపరుద్రుని జన్మ మెప్పుడో తెలియదు; కాని క్రీ. శ. 1240 సంవత్సరమని యూహింపఁ బడినది. రుద్రమదేవి, దౌహిత్రుఁడైన ప్రతాపరుద్రుని దత్తతఁ జేసికొని, యుక్తవయస్సు వచ్చిన పిదప నతనిని త్రిలింగ రాజ్యాభిషిక్తునిఁజేసెను.

ప్రతాపరుద్రుఁడు రాజ్యభారమువహించి పరాక్రమవంతుఁడై, రుద్రమదేవి పరిపాలనముచేయు సమయమునఁ దిరుగుబాటొనర్చి, రాజ్యమునకు బాధలు గలిగించిన

సామంతనృపాలుర గర్వమడంచి, యాంధ్రసామ్రాజ్య మభి వృద్ధినందునట్లు తన యావచ్ఛక్తిని వినియోగపఱచి సఫలీకృతమనోరథుఁడయ్యెను. ఏకశిలానగరము (ఓరుగల్లు) ఆంధ్రరాజ్యమునకు రాజధానీనగరమై విలసిల్లెను. ఐశ్వర్యమునందుఁగాని, మందిరముల సౌందర్యమునందుఁగాని, రాజభవనముల రమణీయతయందుఁగాని, కోటలయొక్క గట్టితనమునందుఁగాని తురుష్కసామ్రాజ్యమునకు రాజధానియైన ఢిల్లీనగరముకంటె మిన్నయై యొప్పుచుండెను. ప్రతాపరుద్రుని సేనానులలో ముఖ్యుఁడు నాగయగన్నసేనాని. ఈతని సోదరులగు నెల్లయనాయకుఁడును, మేచయనాయకుఁడునుగూడ సేనాధీశ్వరులుగ నుండిరి. రుయ్యమ్మకు మఱఁదియైన యిందులూరి రుద్రరాజు ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షులలోనొకఁడుగానుండి, కొంత భూభాగమునకు రాజప్రతినిధియై పరిపాలించెను. బెండపూడి అన్నామాత్యుఁడు గజఘటసేనల కధ్యక్షుఁడై యుండెను. సాహిణిమారుఁడనువాఁడు గురిజాల మొదలగు గ్రామములతోఁ జేరియున్న పల్నాటిసీమకు రాజప్రతినిధియైయుండెను. ప్రతాపరుద్రుని మంత్రులుగాని, సేనాధీశ్వరులుగాని, రాజప్రతినిధులుగాని, స్వామికార్యనిర్వాహకులై, వీరాగ్రేసరులై, యా చక్రవర్తికినాంధ్రసామ్రాజ్యాభివృద్ధికిఁదోడ్పడిరి. ప్రతాపరుద్రునికాలమున నాంధ్రసామ్రాజ్యము నవలక్ష ధనుర్ధరులతో నొప్పుచుండెను.

## మతము.

ప్రతాపరుద్రుఁడు శైవమతాభిమాని యగుటచే, నాతని రాష్ట్రమునకుఁ బెక్కండ్రు శైవమత గురువులు వచ్చుచుఁ బోవుచుండిరి. చక్రవర్తియొక్క యనుచరులును, సేనాధీశ్వరులును, మంత్రులును, సామంతరాజులును శైవమతావలంబకులే యై యుండిరి. అంతకుమున్ను రాష్ట్రమున జైనమతము ప్రాబల్యముగ నుండెను. జైనమతావలంబకులకును, స్మార్త మతావలంబకులయిన బ్రాహ్మణులకును తఱుచు వివాదములు జరుగుచు వచ్చెను. కాని, జైను లెక్కువగ నుండుటచే బ్రాహ్మణు లేమియుఁ జేయఁజాలరైరి. ప్రతాపరుద్రుని కాలమున రాజ్యాధికారము గలిగిన వారెల్లరును శైవులయి యుండుటచే, బ్రాహ్మణులు నెమ్మదిగా జైనమత నాశనమునకై ప్రతాపరుద్రునిఁ బురికొల్పిరి. శైవమతము ప్రబలుచుండెను. జైనులయందు రాజుగూడ నసూయఁ జూపుచు, వారిమాన్యములు గైకొనుటచేత, వారు త్రిలింగరాజ్యమున నుండుటకు వీలులేక, యటు నిటుఁ బోయిరి. బ్రాహ్మణుల మాటలువిని ప్రతాపరుద్రుఁడు జైనులను, తనరాజ్యమునుండి వెడలనడపిన కారణమున, వారుఉత్కలరాజుతోఁ గుట్రలు గావించి ఢిల్లీచక్రవర్తులగు మహమ్మదీయులు దాడివెడలి వచ్చునట్లు గావించి, కాకతీయాంధ్రసామ్రాజ్యలక్ష్మి నస్తమింపఁజేయుటకుఁ గారణులైరి.

## దేవాలయములు.

ఏకశిలానగర దేవాలయము గను ప్రసిద్ధినంది యున్నది. అనేక దేవతామహోత్సవములు నిరంతరమును జరుగుచుండును. ఆ కాలమున వీరపురుషారాధనము మెండై యుండెను. వీరపురుషారాధనమనగా రణరంగమునఁ బరాక్రమమునఁ బోరి, వీరస్వర్గ మలంకరించిన మహావీరుల విగ్రహములఁ జెక్కించి, గుళ్ళు గట్టించి వారిని బూజించుట.

## మహమ్మదీయుల దండయాత్ర.

ప్రతాపరుద్ర చక్రవర్తి యాంధ్రసామ్రాజ్యాభివృద్ధికిఁ జేయవలసిన పనులన్నియుఁ జేయుచుండెను సామ్రాజ్యము దినదినాభివృద్ధి నందుచుండెను. అతని కీర్తిప్రతాపములు సర్వరాష్ట్రములయందును వ్యాపించియుండెను.

ప్రతాపరుద్రునితో సమానమైన పరాక్రమవంతుఁడును, స్వతంత్రుఁడును నగు దేవగిరి రాజైన రామదేవుఁడుండెను. ఇద్దఱికిని నేకారణముచేతనో వైరము గలిగి, యిరువురును బలవంతులేయగుటచే నొకరినొకరు జయించు ప్రయత్నము నెప్పుడును జేయకయుండిరి.

ఈ కాలమున ఢిల్లీ సామ్రాజ్యము తురుష్కులచేఁ బరిపాలింపఁబడుచుండెను. నింతకుమున్ను నూఱు సంవత్సర

ముల క్రిందటనే మహమ్మదీయులు రాజ్యస్థాపనఁ జేసికొని హిందూమతద్వేషులై యుండిరి. ప్రతాపరుద్రుఁడు తురుష్కుల వలన దన రాజ్యమున కపాయము గలుగునని యూహింపక, చుట్టుప్రక్కలనున్న దుర్గముల విషయమై తగిన జాగ్రత్తఁ దీసికొనక, రాజధానీ దుర్గము మాత్రము బలపఱచుకొని యుండెను.

ఢిల్లీ నగరమును ఖిల్జీవంశస్థుఁడగు జలాలుద్దీను పాలించుచుండెను. ఈతఁడు వృద్ధుఁడగుటచే నకారణముగ నొకరితోఁ బోరాడవలయునను తలంపులేనివాఁడై యుండెను. కాని, యీతని సైన్యముల కధిపతియైన యీతని పినతండ్రి కుమారుఁడగు నల్లాయుద్దీ నతి క్రూరుఁడై యుండెను. ఈతనికిఁ బరదేశము లాక్రమించుకొనుటయం దభిలాష కలిగి, గొప్ప సైన్యముతో వెడలి, మాళవదేశమును జయించి, యాకస్మికముగా దేవగిరిపైకి వచ్చెను. రామదేవుని సైన్య మాసమయమున స్వల్పసంఖ్యగ నుండినను, యాతఁ డా మహమ్మదీయు నెదిరించి, ఘోరముగఁ బోరాడెను; గాని, తుదకు సంధిఁ జేసికొనెను. సంధిఁ జేసికొనిన పిదప, నల్లాయుద్దీను ఢిల్లీకరిగి వృద్ధుఁడైన జలాలుద్దీనుని జంపించి, తాను చక్రవర్తి యయ్యెను. భరతఖండమున ననేక సామ్రాజ్యములు నిలుపవలయునని యీతనికి యూహ వొడమెను. ఈతఁడు క్రూరుఁడును, నిరక్షరకుక్షియైనను రాజ్యతంత్రములందు మిగుల సమర్థుఁడు. ఈతఁడు-

ప్రతాపరుద్రుని రాజ్యమునుగూర్చియుఁ, బలాక్రమమును గూర్చియు విని, త్రిలింగ సామ్రాజ్యమును ఢిల్లీ సామ్రాజ్యమునఁ గలుపుకొనవలయునని యూహించి గూఢచారులను బంపి, ప్రతాపరుద్రుని బలాబలముల తెఱంగును, కోట యొక్క స్థానములఁ గనుఁగొని, తనయొద్దనున్న "మల్లికాఫర్" అనువానినీ సేనాధీశునిఁగాఁ జేసి, త్రిలింగరాజ్యమును జయించుటకుఁ బంపెను. మల్లికాఫర్ దేవగిరిమీఁదుగా వచ్చెను. రామదేవుఁ డంతకుఁమున్నే తురుష్కులతో సంధిఁ జేసికొని యుండుట చేత వారీతని రాజ్యమునకే హానియుఁ గూర్పలేదు అదియుంగాక రామదేవుఁడు మాతృదేశాభిమానము విడిచి, మల్లికాఫరునకు సహాయముగూడఁ జేసెను.

మహమ్మదీయులు తన రాజ్యముపై దండెత్తి వచ్చుచున్నారని విని, ప్రతాపరుద్రుఁడు మంత్రి సామంతవర్గమును, సేనాధిపతులను బిలిపించి యిట్లు పలికెను. "వీరులారా! మనపై కిప్పుడు తురుష్కు లెత్తివచ్చుచున్నారు. ఇప్పట్టున మనము వెనుదీయరాదు. సమస్త మెఱింగిన మీకుఁ జెప్పఁదగినంతటి సమర్థుఁడఁగాను. మున్ను ధర్మరాజాదులచేఁ బరిపాలింపఁబడిన ఢిల్లీ సామ్రాజ్యలక్ష్మి నాక్రమించుకొని, హిందూమత ద్వేషులై తురుష్కులు మిగుల గర్వించియుండి, నేడు మన కాకతీయాంధ్ర సామ్రాజ్యమునుగూడ వశపఱచుకొనఁ దలంచి వచ్చుచున్నారు. వీరరసపూరితమగు వారిరక్తము

మన దేశానాదులయందుఁ బ్రవహించుచున్నది. ఆంధ్రులు నిక్కమైన శూరులనిపించుకొనుటకు సమయము వచ్చినది. యుద్ధమే శౌర్యమునకుఁ బాదు; అదియే సకలసౌఖ్యములకుఁ బట్టుకొమ్మ; అదియే శూరులకుఁ గ్రీడాప్రదేశము; అదియే వీరులు ధర్మసంరక్షణార్థమై తమ శరీరములనుండి రుధిరంబుఁ బ్రవహింపఁజేయు స్థలము. వేయేటికి! మన యాంధ్రమాతను వీరమాతగఁ జేయుఁడు. ఒరలనుండి తీసిన విచ్చుకత్తులను, శత్రు సంహార మగువఱకును మరల నొరలలోఁ జేర్పవలదు. ప్రాణావసాన కాలమందైనను బగఱకు వెన్నియకుఁడు. కాకతీయాంధ్ర సామ్రాజ్యేందిర చలింపకుండ జేసి, శౌర్యపౌరుషములు వీరుల కాదర్శకముగాఁ జేసి, సకలదిక్కుల యశోవల్లికలఁ బ్రాకిం పుఁడు."

ప్రతాపరుద్రుని నోటినుండి యీ నుడులు వెలువడఁగనే యచ్చటి యోధుల శరీరములఁ బులకలు జనించెను. వారిహృదయములు సంగరోత్సాహముచేఁ బూరింపఁబడెను. సంగరంబునకు ముందుగ "నే నరుగుదు; నే నరుగుదు" నని ప్రతి వీరుఁడును బలుకుచుఁ దనప్రభుభక్తిఁ బ్రకటించెను. అంతటఁ బ్రతాపరుద్రుఁడు మహమ్మదీయ సైన్యము నెదుర్కొనుటకు లక్షసైన్యమును బంపెను. ఈసైన్యమున కాతని సోదరుఁ డగు నన్నమదేవుఁ డధీశుఁడుగనుండెను. మారయసాహిణియు, గజసాహిణి యు నీతనికిఁ దోడైయుండిరి. ఇంతియే గాక

యీసైన్యమునందుఁ బ్రాణములకయిన నాసపడక పోరాడు కమ్మవీరులు, వెలమవీరులు మొదలగు వారనేకులు గలరు. అన్నమదేవుఁడట్టి సైన్యముతో బయలుదేరి గోదావరీ తీరమును జేరి, మల్లికాఫర్ నెదుర్కొనుటకు రేవులనన్నిఁటిని గాచి యుండెను. మల్లికాఫర్ ఆంధ్రదేశమును బ్రవేశించి యా యా పట్టణములయందున్న దేవాలయములఁ బాడుచేయుచుఁ, బ్రజల హింసించుచు గోదావరీతీరమునకు వచ్చెను. అతఁడు గోదావరిని దాటుటకెంతయో ప్రయత్నముఁ జేసెను. ఆంధ్ర వీరులు, సమానపరాక్రమమున విజృంభించి, గోదావరిని దాటి మహమ్మదీయులను వెనుకకు దఱిమివేసిరి. ఈదండయాత్రలోఁ బెక్కండ్రు మహమ్మదీయులు మడిసిరి. మల్లికాఫర్ పరాజయము నంది ఢిల్లీకిఁ బాఱిపోయెను. కాని, యాతఁడు పట్టుదల మాత్రము విడువలేదు. ఆంధ్రులను సాధించితీరవలయునని యాతనిని మరల నల్లాయుద్దీ నధిక సైన్యముతోఁ బంపెను. రెండవ దండయాత్రయందుఁగూడ మల్లికాఫరు పరాజితుఁడయ్యెను. మూడవసారి యాతఁడు మరల దండెత్తివచ్చి సైన్యముతో నోరుగల్లుకోటచుట్టును విడిసి యుండెను. ఇంతకుమున్ను రెండుసారులు తురుష్కులతోఁ బోరియున్నను నాంధ్రవీరులు తమప్రాణములనైన నాశింపక శత్రువులతో ఘోరముగఁ బోరాడిరి. కాని, యాంధ్రసేనా ధీశ్వరులు పెక్కండ్రు మడిసిరి. విజయలక్ష్మి తురుష్కులనే

వరించునట్లుండుటచేత, ప్రతాపరుద్రుఁ డాలోచించి మల్లికా ఫరుతో నెట్లో సంధిఁజేసికొనెను. మల్లికాఫరు ఢిల్లీకి మరలి పోయెను.

ప్రతాపరుద్రుఁడు ఢిల్లీచక్రవర్తితో సంధిఁజేసికొనెనని కొందఱు సామంతరాజులు తిరుగుబాటొనర్చి, స్వతంత్రత బ్రకటించిరి. అంతట బ్రతాపరుద్రుఁడు బయలుదేరి తిరుగుబా టొనర్చిన వారిని జయించి, వారలఁ దనకు వశవర్తులుగాఁ జేసికొని, మహమ్మదీయ దండయాత్రలవలన నష్టమైన సైన్య మును మరలఁ జేర్చుకొనియుండెను. దేవగిరియందు రామ దేవుఁడును, నతని పుత్రుఁడును మరణించిరి. రామదేవుని యల్లుఁడగు హరిపాలదేవుఁడు మహారాష్ట్రమునుండి తురుష్కు లను బాఱదోలెను. ఈ సమయమున మల్లికాఫర్ అల్లా యుద్దీనునకు విషప్రయోగము జేయించి చంపించి, యాతని జ్యేష్ఠపుత్రుని కన్నుల నూడబెఱికించి, యాతని తమ్ముని నైదేండ్ల వానిని రాజ్యమునందునిలిపి, తాను ప్రభుత్వముసేయఁ దొడంగెను. మల్లికాఫర్ పరిపాలన మొల్లక, వానిసేవకులేవాని నంతమందించిరి. అల్లాయుద్దీను నాల్గవకుమారుఁడగు ముబారక్ అనువాఁడు కఠినచిత్తుఁడై సోదరులఁజంపి పట్టాభిషిక్తుఁడయ్యెను. వీనిసేనాధిపతి 'ఖుస్రూ'యనువాఁ డాతనని జంపి,తాను సింహా సన మెక్కెను. ఈ ఖుస్రూ ప్రచ్ఛన్న వేషముతోనున్న హిందువు. ఢిల్లీసామ్రాజ్య మీస్థితిలో నుండఁగా, పంజాబులో

సుబేదారుగనున్న యొకఁడువచ్చి ఖుస్రూనుజంపి, సింహాసన మెక్కి "గ్యాసుద్దీను తుగ్లఖ్" అను పేరుతో రాజ్యపరి పాలన మారంభించెను.

గ్యాసుద్దీను తన కుమారుఁడగు అలూఫ్ ఖానుని సైన్య సమేతముగాఁ బ్రతాపరుద్రునిపైకిఁ బంపెను. ప్రతాపరుద్రుఁ డదివఱ కెన్నియో యుద్ధములు జేసియున్నను చలింపక, పేరు మోసిన యాంధ్రవీరుల నియోగించి మహమ్మదీయుల నెదు ర్కొనెను. ఈ యుద్ధమున నాంధ్రులు తమ ప్రాణముల దాచుకొనక పోరాడిరి. మహమ్మదీయు లదివర కెన్నఁడును పొందని పరాభవముఁబొందిరి. అలూఫ్ ఖానుఁడు ఢిల్లీకి పాఱి పోయెను.

ఈ పరాభవము విని, సహింపజాలక యెట్లయిన నాంధ్రులపైఁ బగదీర్చుకొనఁదలంచి, ఢిల్లీచక్రవర్తి మరల నాంధ్రదేశముపైకి అలూఫ్ ఖానునిఁ బంపెను. ఈసమయమున నాంధ్రుల యదృష్టము సరిగాలేదు. ప్రతాపరుద్రుని సేనా నాయకులలో కమ్మవారును, వెలమవారును తమలోఁ దాము కలహించిరి. అయినను వారు స్వామిభక్తిని మాత్రము విడువక రిపులతో నతి భయంకరముగఁ బోరాడిరి. కాని, కాకతీ యాంధ్ర సామ్రాజ్యలక్ష్మి యస్తమించు సమయమగుటచే మహమ్మదీయులే విజయులైరి. ఈఘోరయుద్ధమునఁబ్రతాప రుద్రుఁడు చెఱబట్టుకొనబడి ఢిల్లీకి గొనిపోవఁబడెను. ఓరుగల్లు

రాజ్యము తురుష్కులచేఁ బడెను. కొన్నాళ్ళకుఁ బ్రతాపరుద్రుఁ, డతని మంత్రియగు యుగంధరునిచేఁ జెఱవిడిపింపఁబడి, యీవలకు వచ్చి, గోదావరీతీరమునఁ గొన్నాళ్ళుండి స్వర్గస్థుఁ డయ్యెను.

## ఆంధ్రభాష.

ప్రతాపరుద్రుఁడు బాల్యమునుండియు నాంధ్రగీర్వాణ భాషలయం దభిలాషకలవాఁడు. ఆతని యాస్థానమునఁ బెక్కండ్రు కవులుండిరి. అందు గీర్వాణభాషాకోవిదుఁడగు విద్యానాథుఁడు ముఖ్యుఁడు. ఈతఁడు సంస్కృతమునఁ బ్రతాపరుద్ర యశోభూషణమను గ్రంథమును వ్రాసి ప్రతాపరుద్రునకుఁ గృతి నిచ్చెను. ఈతని రాష్ట్రమునన త్రిపురాంతక కవి, మారనకవి, భాస్కరకవి, మంచనకవియుఁ గలరు. ఈతని మంత్రులు, దండనాయకులుఁగూడ భాషాభిమానులగుటచే, నీతని పరిపాలనమున నుభయభాషలును సంపూర్ణాభివృద్ధి నందినవి.

కాలమహిమనుబట్టి కాకతీయాంధ్ర రాజ్యవైభవ మడంగిపోయినది. ఆంధ్రవీరుల ప్రాభవము, ఏకశిలానగరము (ఒరంగల్లు) పాడైన కోటగోడలయందు నిద్రించుచున్నది.

# 5. రామదాసు.

భారతభూమిం జనించి, తమ నిరుపమాన భగవద్భక్తిచే యశశ్శరీరములఁ బ్రాణముల నిలుపుకొన్న మహాత్ము లెందరో కలరు. అట్టివారిలో భక్తాగ్రేసరుఁడగు రామదాసు నామ మెఱుంగని వారెవ్వరును లేరు. ఎంతవఱకీ భరతవర్షము విరాజిల్లుచుండునో యంతవఱకీ రామదాసునామము భారతీయుల హృదయపీఠములందు నిలిచియే యుండును. పరాత్పరుండగు నా శ్రీరామచంద్రుని దనయద్వితీయ భక్తిలతలచే హృదయంబున బంధించి, తరింపఁగల భాగ్య మా రామదాసునకే లభించినది.



రామదాసు జన్మస్థానము నేలకొండపల్లి. ఇంటిపేరు కంచెర్లవారు. తండ్రి లింగనమంత్రి. ఈతనికిఁ దల్లిదండ్రులు మొదట పెట్టినపేరు గోపన్న. ఈతని తండ్రి, తాతలు గోలుకొండ సంస్థానమున నుద్యోగములు జేసియుండిరి. మంత్రిశిఖామణులగు నక్కన్న, మాదన్న లీతనికి మేనమామలని చెప్పుదురు. గోపన్న బాల్యమునుండియు సుగుణమూర్తి యగుటయేగాక భగవద్భక్తి గలిగియుండెను. ఇట్లుండ నొకనాడు గోపన్న నివసించు గ్రామమునకుఁ దురుష్కుఁడును, రామభక్తుండును నగు "కబీరు" అను మహాత్ముఁడువచ్చి గోపన్న ముఖతేజమును జూచి, యాతఁడొక మహాభక్తు

గ్రేసరుండగునని తలంచి, రామతారకమంత్ర ముపదేశించి "గోపన్నా! నీ వీ మంత్రము నిరంతరముఁ బఠించుచుండుము. ఇదియే మోక్షసౌధారోహణమునకు సోపానము. నీవు గోలు కొండకరిగి, నవాబగు తానీషాను దర్శింపుము. కొలది దినము లలో నీకున్నతోద్యోగంబు లభించును. నీయశస్సు దేశమంత యును వ్యాపించును," అనిపలికెను.

కబీరుచే నుపదేశమందిన గోపన్న భక్తి, నానాటికి హెచ్చెను. జగమంతయు నాతఁడు రామమయముగనే చూచు చుండెను. కొన్నాళ్ళకాతఁడు గోలుకొండకేగి తానీషాను దర్శించెను. అక్కన్న మాదన్నలతో నాలోచించి, తానీషా గోపన్నకు భద్రాచలముతాలూకా తహసీల్‌దారు పని నొసంగెను. గోపన్న భద్రాచలము జేరిననాటినుండియు, నచ్చటివారు మున్నెప్పుడు జూడని దానధర్మములు, దేవతా సమారాధనలు చేయుచుండెను. పరమభక్తాగ్రగణ్యుఁడగు నా గోపన్నయేనిరంతర మచ్చట తహసీల్‌దారుగా నుండవలయు ననియు, నతఁడు పదివేలవర్షములు వర్ధిల్లవలయుననియుఁ గోరు చుండిరి.

ఇట్లుండ నొకనాడు గోపన్న భగవత్సమారాధనము జేయుచుండగా, నైదేండ్ల వయస్సుగల యాతని కుమారుఁడు వేడిగంజిగుంటయందుఁ బడి మృతుండయ్యెను. గోపన్నయు నాతని భార్యయు విలపించుచుఁ, గుమారుని రక్షింపుమని

శ్రీరామచంద్రుని వేడుకొనుచుండిరి. ఆసమయమున కచ్చటికి "కబీరు" వచ్చి గోపన్నకు దుఃఖశాంతికరములగు వాక్యములఁ జెప్పెను. శ్రీరామానుగ్రహమున నా కుమారుఁడు జీవించెను. గోపన్న సంతోషమునకు మేరలేదయ్యెను. కబీరతనిగాంచి "రక్షించుటకును శిక్షించుటకును, శ్రీరాముఁడే కర్త. ఆతఁడు నీయెడలఁ గరుణించి, నీ నిశ్చలభక్తికి సంతసించి, మృతుండైన కుమారుని బ్రదికించినాడు. శ్రీరామానుగ్రహమునకు బాత్రుఁడ వైన నీవు నేటినుండి "రామదాసు" అనుపేరఁ బరగుదువు గాక! "యనెను.

గోపన్న రామదాసయ్యెను. ఆతఁడు భద్రాచలమునకు తహస్సీల్దారుగాఁ బోవకమునుపా తాలూకాపైఁ జాల కాలమునుండి అఱులక్షలరూపాయల శిస్తు వసూలు కావలసి యుండెను. రామదాసచ్చటికేగిన తరువాత నా ధనమంతయు వసూలయ్యెను. రామదాసు, ఆ ధనమంతయు ఖర్చుపెట్టి భద్రాద్రియందు జీర్ణదశయందున్న శ్రీరామదేవాలయము మహోన్నత స్థితికిఁ దెచ్చెను. ఆ యాలయమునకు గర్భగృహ ప్రాకారమండపధ్వజస్తంభరథాదులు నిర్మాణము జేయించెను. సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు, నవరత్నఖచిత భూషణంబులఁ జేయించి యలంకరించెను.

సర్కారు పైకము వెచ్చించి, రామదాసు శ్రీరామాలయ నిర్మాణాది కార్యములు జేయించెనని తానీషాకుఁ దెలిసెను.

ఆతఁ డాగ్రహమంది "రామదాసునొద్ద నాఱులక్షల పైకమును దెండు. లేదన్నచో నాతనిని బంధించి తోడితెండు" అనిపలికి, తురుష్క-భటులను భద్రాచలమునకుఁ బంపెను. తురుష్క-భటులు భద్రాచలమునకు వచ్చి, రామదాసునకుఁ దానీషా యాజ్ఞఁ దెలిపిరి. ఆతఁడు పైకము నెట్లీయగలఁడు? భటు లాతనికి సంకెళ్ళు వేసి గోలుకొండకుఁ దీసికొనిపోవ దలంచిరి. అప్పుడు రామదాసు భార్య చింతించుచుండ నాతాఁ డామె కిట్లనెను. "తరుణీ! నీవుగాని, నేనుగాని యధైర్యమందిచింతించి నందువలనఁ బ్రయోజనముండదు. నాచేత నట్టి మహాత్కార్యములఁ జేయించిన శ్రీరామచంద్రమూర్తి, నాకు సిలుగులు గూర్చునా! నే నీ భటులవెంట నేగి పాదుషాకుఁ జెప్పవలసిన దంతయుఁ జెప్పెదను. రఘునందనుం డాతని హృదయమునఁ బ్రవేశించి సద్బుద్ధిఁ బ్రసాదింపకయుండునా! నీవు ధైర్యచిత్తవై యుండుము. శ్రీరామసేవ మాత్రము మఱవవలదు. కుమారుని జాగరూకతతో నరయుచుండుము."

తురుష్క-భటులు రామదాసుని శృంఖలాబద్ధునిగఁ జేసి, గోలుకొండకుఁ దీసికొనిపోయిరి. తానీషా రామదాసున కిట్లనెను. "నీవు మా ముఖ్యమంత్రులగు నక్కన్నమాదన్నలకు మేనల్లుఁడవనియు, నీతండ్రి మాసంస్థానమున నుద్యోగియై యుండెననియుఁ దలంచి, నీకు తహసీల్‌దారుపని నొసఁగినాము. కాని, యిట్టివాఁడవగుదువని నే నెప్పుడును తలంచి

యుండ లేదు. నీవు వసూలుచేసిన యాబులక్షల పైకమును దెమ్ము. లేనిచో దాని నిచ్చువఱకుఁ గారాగృహంబున నుండుము.'' అందులకు రామదాసిట్లు బదులు చెప్పెను. "పాదుషాగారూ! నేను సర్కారునకు వ్యతిరేకమైన కార్యము గాని, నష్టమగు కార్యముగాని చేసియుండ లేదు. నేను వసూలు చేసిన పైక మెన్నియో సంవత్సరములనుండి తాలూకాపై రావలసినదై యున్నది. ఇంతకుముం దచ్చట తహస్సీల్దారులుగ నున్నవా రాపైకము వసూలుకాదని వదలివేసిరి. నే నరిగిన పిమ్మట శ్రీరామానుగ్రహమున వసూలయినది. ఇందు నేనొనర్చిన చౌర్యకృత్యమేమియును లేదు. శ్రీరామాలయనిర్మాణాది సత్కార్యములకు వినియోగించిన యా పైకమంతయు మీదే యని లోకమున కెఱుంగఁ జేసియేయుంటిని. దీనికి ఫలము, భగవంతుండగు శ్రీరామచంద్రమూర్తి మీకే యొసంగును. మీ రాజ్యమున గోదావరీతీరమున శ్రీరామచంద్రునకు నివాసమైన భద్రగిరి పుణ్యక్షేత్రమై యొప్పుట మీకుఁ గీర్తికరముగాదా! నేను వెచ్చించిన యీధనము, మీకొక్కనాటి ఖర్చుని తలంపుఁడు. ఇందులకు మీరు సమ్మతింపక నన్ను శిక్షింపఁదలంతు రేని, నేను భయమందను గాని, యది ధర్మముకాదని చెప్పుదును. శ్రీరామచరణాసేవారతుఁడనైన నే నా మహనీయుని కొఱకెన్నికష్టములనైనఁ బడుదును.''

రామదా సెంత చెప్పినను తానీషా వినలేదు. రామదాసు చెఱలోఁ బెట్టఁబడెను. అతఁ డొక్కింతయు నధైర్యముగాని, విచారముగానియుండలేదు. శ్రీరామచంద్రమూర్తిని హృదయపీఠమున నిలిపి, తన్ను రక్షింపుమని వేడుచుండెను. పైకము నిమ్మని తానీషా యాతని కనేక బాధలు గలిగించెను. భటులు రామదాసుని ముండ్లకంచెలపై నడిపించిరి. కొరడాలతో గొట్టిరి. వేడియెండలో నడిపించిరి. వా రెట్టివిధమున శిక్షించుచున్నను రామదాసు శరీర మావంతయుఁ గందలేదు.

పెక్కుమాసము లాతఁడు కారాగృహంబున నపరిమిత కష్టంబు లందుచుండెను. భక్తరక్షణపరాయణుఁడైన, శ్రీరామదేవున కాతనిపైఁ గరుణకలుగు దినములువచ్చెను. ఒకనాటి యర్ధనిశియందు రామలక్ష్మణులు రామదాస రక్షణోద్యోగము వహించి, సప్తద్వారముల యందుండు భటులను దాటి, తానీషా యంతఃపురమును బ్రవేశించి, తలుపు తెఱువుమని పిలిచిరి. ఆసమయమునఁ దన శయనమందిరమునకు వచ్చిన వారెవ్వరోయని తలంచుచు, దానీషా ద్వారము తెఱచి యీవలకువచ్చి వారింగాంచి "మీ రెవ్వరు? ఏమిపనికై యీ రాత్రిసమయమున వచ్చితి"రని యడిగెను. మేము భద్రాద్రి నివాసులము. రామదాసుని యాజ్ఞననుసరించి పనులు సేయుచుందుము. అతఁడు మీ కీయవలసిన యాఱులక్షల పైకము నిచ్చుటకు వచ్చితిమి. పైకముదీసికొని రసీదునిచ్చి మాకు

రామదాసు నొప్పగింపు"మని పలికి పైకమును నాతని యెదుటఁ గ్రుమ్మరించిరి. ఆతఁడాశ్చర్యమంది వారినిఁ బీఠములయందుఁ గూర్చుండుడనెను. "మేముత్వరగాఁ బోవలయు"నని రామలక్ష్మణులు బదులుచెప్పిరి. పైకము నెంచుకొని తానీషా వారికి రసీదునిచ్చెను. కన్నుమూసి కన్నుదెఱచునంతలో రామలక్ష్మణులు మాయమైరి. రామదాసు చెఱయందు నిద్రించుచుండఁగా వారాతనిం జేరి "నీపైకము ముట్టినది; ఇదిగో రసీదు," అని పలికి, రసీదు నతనిముందుఁ బడవేసి యదృశ్యులైరి.

రామలక్ష్మణు లరిగినతరువాత తానీషా తనచిత్తమున "ఇదియంతయుఁ జిత్రముగ నున్నది. పైకము దెచ్చినవారు రామలక్ష్మణులని గ్రహించి పూజింపనైతిని. ఇఁకనైన రామదాసుని గారాగృహ విముక్తునిజేసి, నాయపరాధమును సహింపుమని ప్రార్థించెదగాక" యనితలంచి, యాక్షణముననే రామదాసునిఁ జెఱనుండి విముక్తునిఁ జేసి "నీవీయవలసిన పైకమంతయు ముట్టినది. నేను నీయెడలఁ జేసిన మహాపరాధముల మన్నింపుము. నీవు మహాభక్తుండవని నేడు తెలిసినది. ఆపైకమును నీవు మరలఁగైకొని నీయిచ్చవచ్చినట్లు వెచ్చింపుము,"అని యాతని పాదములపైఁ బడెను. తనపై శ్రీరాముఁడిట్లు కరుణించెనని రామదాసు సంతోషించి, తానీషా కిట్లు

నెను. "తానీషా! నీవెంతయు ధన్యుఁడవు. నన్నుగన్న తండ్రి యగు శ్రీరామచంద్రమూర్తిని నీవుకన్నులారగాంచితివి."

రామదాసు వలదని యెంతచెప్పినను వినక, తానీషా యాతని కా పైకము మరల నిచ్చివేసి, శ్రీరామచంద్రునకై వినియోగించవలసినదని చెప్పి, భద్రాచలము శ్రీరామునకు మాన్యముగా నొసంగి, యెప్పటియట్లు తహాసీల్దారుగా భద్రాచలమునకుఁ బంపెను. తానీషామాటఁ ద్రోసివేయఁ జాలక రామదాసు మరలఁ గొన్నిసంవత్సరములు తహాసీల్దారుగా నున్నట్లు తోఁచుచున్నది. తన యసమానభక్తిచే శ్రీరామచంద్రుని యనుగ్రహము సంపాదించిన భక్తాగ్రేసరుఁడైన రామదాసు ఆంధ్రులకు నిరంతర స్మరణీయుఁడుకదా! ఆంధ్రు లీతనిని, ఈతఁడు రచించిన దాశరథిశతకమును నెప్పటికిని మఱువఁజాలరు.

# 6. గోవ్యాఘ్ర సంవాదము.

పూర్వ మొక భూసురుని యొద్ద, నిత్యసత్యవర్తినియగు హోమధేనువుండెను. అదియెన్నఁడును నితరగోవులతోఁ గలహంబునకుఁ బోయియెఱుంగదు. తనకు గలిగినంతలో నే సంతృప్తి నందుచుండును. ఇట్టి సురభియొకనా డరణ్యమునకుఁ

బోయి మేయుచుండ, వ్యాఘ్రంబొకటి పొంచి పొంచి చూచి దానిమీదకు లఘించెను. అప్పుడా గోరత్న మొక్కింతయు భయమందక యావ్యాఘ్రముతో "నిలువుము; నిలువుము. తొందరపడవలదు. నావాక్యములు వినిన పిదప నీయిచ్ఛ వచ్చినయట్లు చేయు" మని పలికెను. ఆమాటలకు బెబ్బులి యాశ్చర్యమంది, కొంత సేపటి వఱకును జిత్తరువువలె నిలిచి, యాధేనువు నీక్షించి "ఆమిషార్థినై వచ్చిన నన్ను వారింపఁ గారణమేమి ? నీ వేమి నుడువఁదలంచితి" వని యడిగెను. అంతులకు సురభి "ఓవ్యాఘ్రరాజమా ! నాకొక ముద్దులపట్టి జనించి నేటికిఁ బదునైదు దినంబులయ్యెను. అతఁడింకను గరికఁ దినుట నేర్వలేదు. నే నరిగి కడుపారఁ జన్నుఁగుడిపి సత్వరమ్ముగ వచ్చెదను. నాయెడలఁ గరుణవహించి యిందుల కనుజ్ఞనిమ్ము" అని పలికి, మరలఁ దనయంతరంగమున వత్సము నుద్దేశించి "ఇప్పుడు నాదూడకుఁ బాలిచ్చి వచ్చెదఁగాక! ఆపాలు పుడిసెడు, నరిగిన పిదప దాని కేమిగతియో! నన్నుఁగానక యది యేధేనువు పొదుగైనఁ గుడువఁబోయినఁ బొడువకయుండునా! పొరుగిండ్లకుఁ బోయినఁ గుక్కలు పైఁబడి కఱచునేమో!" యని విచారించి తనవిచారము బయలుబడినచో వ్యాఘ్రము తన్ను వత్సమును జూచివచ్చుట కనుజ్ఞ నీయదేమోయని మరలఁ బుండరీకమును జూచి, "కొంచెము పాలతో నాసుతునకు సంతృప్తి

రెుదవును. నీకు నా మాంసమంతయు భుజించినఁగాని తృప్తి యెుదవదు. కావున నీవొక్కింతకాల మోర్చుకొనియుండుము. నేను సత్వరముగఁ బోయివచ్చెద" ననెను. అందులకు వ్యాఘ్రము "గోరత్నమా! నీమాటలునాకుమిగుల నద్భుతము గలిగించుచున్నవి. కొడుకునుజూచివచ్చెదనని నీవు చెప్పుమాటల నెవ్వరైన నమ్ముదురా!" యనిన ధేనువిట్లనెను. నీవు నన్ను విశ్వసింపుము. నేను నాసుతునకుఁ బాలిచ్చి, తగుబుద్ధులు చెప్పి యరుదెంతును. నీ వంగీకరింపక యున్న నే నేమియుఁ జేయ జాలను. అతిథి సత్కారముకంటెఁ బుణ్యమైన కార్యము మఱియొకటి లేదని ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. ఇప్పుడు నీవు నాకతిథివైతివి. అట్టియెడల నేను నిన్ను విడిచితి నేని బాపము సంభవింపదా! కన్న కడుపగుటచేతను, నాతని విడిచి దూరమరుగు సమయమగుటచేతను నింత చనవుఁబూని నిన్ను బ్రదిమాలుచుంటిని. నాయెడలఁ గొంచెము కరుణఁ బూనుము."

ధేనువు మాటలువిని కొడుకును జూచి సత్వరముగ వత్తునని శపథము సేయుమని పుండరీకము పలికెను. ధేనువు పెక్కు శపథములు జేసినపిదపఁ, బుండరీకము దానిని నమ్మి పోయిరమ్మనెను. గోవు తిన్నగాఁ గదురయుమున గృహము నకుఁబోయి యంబారవము గావించెను. వత్సము చెంగు చెంగున దాటుచుఁ దల్లిం జేరి చన్నుగుడువసాగెను. అదిపాలు

మత్పవిత్రవంశము నీకతంబున భూతలమున నాచంద్రార్క తారావనీ శరధిస్థాయిగ నిలచును. నీవిఁక ధైర్యమున నుండుము. నాకై పులి వేచియుండును.”

ఇట్లు చెప్పి వత్సంబునోడఁబఱచి యాధేనువు కడు రయమునఁ బుండరీకమున్న తావునకుఁ బోయెను. ఇంకను ధేనువు రాలేదని యాకలిచేఁ దపించుచున్న యావ్యాఘ్రము నెదుట నిలిచి, సురభి “శార్దూలవరేణ్య! నీవు నా యెడలఁ జూపిన కరుణకు సంతసించితిని. నీ దయవలన నా కుమారునిఁ జూచివచ్చితిని. ఇఁక నీవు నన్నాహారముగాఁ జేసికొని యాకలిఁ దీర్చుకొనుము. నేను పుణ్యలోకమునకుఁ బోవుదు”ననెను. అంతకుముందెంతయో యాకలిబాధ నొందుచున్న పుండరీకము ధేనువుంజూచి, దాని సత్యసంధతకుఁ నచ్చెరువుఁబొంది యట్టె నిలిచియుండెను. ‘త్వరగా నన్ను భక్షింపు’ మని సురభి సమీపించినకొలదిని శార్దూలము వెనుకకుఁ బోవఁదొడంగెను. ఎంత బలవంతపఱచినను శార్దూలము సురభిం జంపనొల్లక “గోరాజమా! నీ విమల సత్యప్రౌఢికిఁ మెచ్చితి. నిన్నుఁజంపఁజాల. నీవు నిజవాసము జేరి, కొమరునితో సుఖముగా నుండు”మనెను. అప్పుడు గోవు సత్యవాక్శుద్ధికిని, పులికృపాసమగ్రబుద్ధికిని మెచ్చి, శ్రీహరి వాటికి దివ్యపదవి నొసంగెను.

# 7. ప రో ప కా ర ము.

దుర్యోధనుని యాజ్ఞ ననుసరించి వారణాసీపురంబునఁ బురోచనుఁడు నిర్మించినలాక్షాగృహాగ్నిజ్వాలలనుండి తప్పించు కొని, పాండవులు, జననియగు కుంతితోఁగూడ బ్రాహ్మణ వేషములతో నేకచక్రపురముఁ జేరి, యందొక బ్రాహ్మణుని గృహంబున వసించుచుండిరి. వ్యాసమహర్షి యనుగ్రహమున నొదవిన షడంగయుక్తవేదాధ్యయనం బొనర్చుచుఁ గుహనా ద్విజవృత్తిఁ జరించుచు, విప్రగృహంబులందుఁ భిక్షము నెత్తు కొనుచు, సజ్జనారాధ్యులైన యప్పాండవులు,జఠరరక్ష నమర్చు కొనుచుండిరి.అనుదినంబును దమగృహంబులకు వచ్చు నప్పాం డవులను దద్గ్రిహాకర్త విష్టార్థసమర్పణక్రియఁ బ్రహర్షమున సుకృల జేయుచుండిరి.

ఇట్లుండ నొక్కదినంబునఁ బాండవులున్న గృహంబు నకు యజమానియైన బ్రాహ్మణుండు "హా! దైవమా! నీవు మాయంతముఁ జూడఁదలంచితివి కాబోలు! ఆదుష్టరక్కసున కాహారముగాఁ బోవుటకు నేడు మావంతువచ్చినది. వాని కెవ్వరి నాహారంబుగాఁ బంపుదును! విధ్యుక్తప్రకారంబున మత్పరిణీతయై, ధర్మచారిణియు, వినయవతియు, ననువ్రతయు నగు నిక్కుటుంబిని నెక్కరణిఁ గ్రక్కున రక్కసున కాహారం బగుమని యనుపుదు! అధికధర్మప్రవృద్ధిఁగాఁదగిన వరున

కల్పింప విధాతృనివలనం బడసిన యికుమారి, నతిబాలను, దీనియందుద్భవిల్లు దౌహిత్రలాభంబుదొలంగ నెత్తెఱంగున నారాక్షసున కశనంబగుమని విసర్జింతు! అస్మదీయపిండోదక ప్రదాన నిదానుండును, వంశవర్ధనుండును, బిత్రాణమోక్షణుం డును నగు నికుమారు, నెఱిచిఱుతవానింజూచిచూచి, యెప్ప గిది నప్పిశితాశి వాతంద్రోతు! సజీవుండనై యిట్టి కఠినక్రియల కుత్సహింపనోపం గావున, నద్దానవున కేన భక్ష్యంబయ్యెద" నని తలంచి, యాత్మపరిత్యాగంబునందుం గృతనిశ్చయుండై యుండెను. అట్టి సమయమున నాగృహస్థుంగని గృహిణి యిట్లనెను. "ప్రాణేశ్వరా! నీ వెందులకుం జింతించెదవు? మనము ఘోరవిపదాబ్ధిలో మునింగితిమి. దీనిం దరింప మనకుం దరముగాదు. దైత్యున కాహారంబుగా నే నరుగుదును. నీవు ధైర్యమున నుండుము. వంశవిస్తారకుండగు తనయుం డున్నాడు. పుత్రిక యున్నది. ఈమెకుం దగిన వరునిందెచ్చి వివాహ మొనర్చి, కుమారునిం జూచుకొనుచు నెట్లో కాలమును వెళ్ల దీయుము. ప్రాణములు విడిచియైన, భార్య భర్తకు హితము సేయవలయును. అదియుంగాక భర్తకంటె ముందు స్వర్గముం జేరుసతి, జగంబునందు యశముంగాంచును. భర్తృహీనయగు కాంతబ్రదుకు జనులచేం గడుహేయముగం జూడంబడును. మఱియు, భార్యమరణించెనేని భర్తకుం బునర్దారా సంగ్రహ మున కధికారము కలదు."

ఈమాటలు విని వారిపుత్రిక "జననీ జనకులారా! మీరు నన్నెంతకాలము పెంచినను నేను మీదానఁగాను. నన్నొరుల కిచ్చుటకన్న మీప్రాణసంరక్షణార్థమై నన్నసురుని వాతం బడవేయుట మిగుల పుణ్యము. మీరు విచారింపక నన్నుఁబంపు"డని పలికెను. "మీరెవ్వరును బోవలదు. నన్నా దైత్యుని కడకంపుఁ" డని కొడుకు నుడివెను.

ఇట్లు వారందఱును నసురుని కాహారంబు గాఁబోవుటను గూర్చి దుఃఖించుచుఁ పెద్దపెట్టున రోదనముసేయ, నయ్యెడకుఁ గుంతివచ్చి వారి విచారకారణంబేమని యాగృహస్థునడిగెను. అందులకుఁ గృహస్థుండిట్లు పలికెను. "అమ్మా! ఏమి చెప్పుదును! ఈపురమున కనతిదూరమున నున్న యరణ్యమున బకాసురుఁడను నొక దానవుఁడున్నాఁడు. ఆ దుర్మార్గుఁడు పురమును బ్రవేశించి, యిచ్చవచ్చినట్లీల మానవులను జంపుచుండఁ బురజనులందఱును భయమంది వానితోఁ బ్రతిదినమును బురిలోనికివచ్చి ప్రజలను హింసింపవలదనియు, నను దినము నిలువరుస నొక్కమానిసిని, రెండెనుబోతులఁ బూన్చి శకటముపై వివిధ భక్ష్యములతో, భోజనమును బంపుచుందుమనియు నొడంబడికఁ జేసికొనిరి. ఆ యొడంబడిక ననుసరించి, ప్రతిదినము నట్లు జరుగుచున్నది. నేడు మాయింటివంతు వచ్చినది. అందుచే మాలో నెవ్వరమా నక్తంచరున కాహారముగాఁ బోవుదమా! యని దుఃఖము చుంటిమి."

బ్రాహ్మణునిమాటలు విన్నయంతనే కుంతికి వారియెడలc గరుణగలిగి, యా యాపదనుండి వారిని రక్షింపవలయునని తలంచి యాతనింగాంచి "బ్రాహ్మణోత్తమా! ఇందులకై మీరు చింతింపవలదు. నీకొక్కcడే సుతుండున్నాcడు. నాకేవురు గలరు. అందులో నొక్కనిని బకాసురున కాహారంబుc గొనిపోవుటకై నియోగింతు"ననెను. అప్పలుకులు విని యా ద్ధరామరుcడు "హరిహరీ!" యని చెవులు మూసికొని "తల్లీ! ఎంతమాటc బలికితివి! జీవితార్థినై నాయింటికి వచ్చిన బ్రాహ్మణుని దైత్యువాతc ద్రోయుటకు నా చిత్తంబెట్లు సమ్మతించును? ఇంతకంటె ఘోరపాతకము మఱియొకటి యుండునా!" యనినc, నందులకుc గుంతి, భూసురున కిట్లుపలికెను. "మహాత్మా! నేను మీపరితాపముc జూడcజాలక నా కుమారుని భవదర్థము రక్కసునికడ కంపcదలంచితిని. నేను నా యాత్మజుని శక్తి నెఱింగినదాన నగుటచేతనే యట్లొనర్చుచుంటిని. ఆతం డధికమంత్రసిద్ధుcడు. అతుల భుజాబలుcడు. బకాసురుండొక్కcడేగాక సకల దివిజా దివిజ గుణంబేకంబై వచ్చినను నా నందనుcడు భీతిలువాcడుకాడు."

ఇట్లుపలికి, యప్పుడే బ్రాహ్మణ గృహంబులనుండి భిక్ష దెచ్చిన భీముని బిలిచి, యక్కుంతి, బ్రాహ్మణ గృహస్థుని యవస్థ యంతయుc దెలిపి, బకాసురుని వధించి యాతనికి సంతోషముc గూర్చుమని నియోగించెను. భీముం డందులకు

సంతోషమున సమ్మతించెను. అంతలో ధర్మార్జున నకులసహదేవులు తమతమ భిక్షాశనములఁ దెచ్చి, తల్లిముందుంచి, తమ ముందట భయంకరాకృతిని వహించియున్న భీముని జూచి యద్భుతమంది, "తల్లీ! భీముఁడు నేఁడెవ్వరితోడనో ప్రధనము సలుప సమకట్టిన విధంబునఁ గనిపించుచున్నాఁడు. ఇచ్చట వైరు లెవ్వరును లేరే! ఇట్లుండుట కేమి కారణ?" మని యడిగిరి. భూసురపరితాపనివారణార్థము బకునిఁ జంపుటకుఁ దాను భీముని నియోగించిన విధ మాకుంతి వారల కెఱింగించెను. తల్లి మాటలు విని ధర్మజుం డిట్లుపలికెను. "అమ్మా! ఎంత సాహసముఁ జేసితివి? ఇతరులకై నిజాత్మజుల విసర్జించు వెంగలు లెందైనఁగలరా! సుశ్లోకుండైన యీతఁడు నీకు విడువఁదగిన సుతుఁడే! ఎవ్వని పరాక్రమముచేత మనము లాక్షాగృహంబునుండి వెల్వడఁగంటిమో, అరణ్యమందు మనకు నిద్రాభంగమగునని, హిడింబాసురుని దూరమునకుఁ దీసికొనిపోయి యెవ్వఁడు వధించెనో, ఎవ్వని భుజాబలమునకు వెఱచి ధార్తరాష్ట్రులు ధృతి దఱిఁగి నిద్ర నుడిగియుందురో, యట్టి శౌర్యనిధియైన యనిలాత్మజుని, నా బకాసురుని నోటఁ దోసితువా?

తనయుల మాటలకుఁ గుంతినవ్వి యిట్లనెను. "కుమారులారా! వృకోదరుని బలంబెఱుఁగక యీకార్యమునకుఁ బంపినదానఁగాను. ఈతఁడు వజ్రశరీరుఁడు. యశనిపాణినైనఁ

గెలువ సమర్థుఁడు. ఈతనింగూర్చి మీరు సంశయింపవలదు. బకునిఁ దెగటార్చి, బ్రాహ్మణ గృహస్థుని బెడదఁబాపును. మన మీ బ్రాహ్మణోత్తముని గృహంబునఁ బెక్కునాళ్ళ నుండి సుఖస్థితి నున్నందులకుఁ, బ్రత్యుపకారము గావించు దఱి దొరకొనియెను. అవని దివిజులకుఁ బ్రియంబుసేయుటకంటె మఱియొక సుకృతంబేమియున్నది? బ్రాహ్మణాశీర్వచన ప్రభావంబున మీకు నిత్యాయురారోగ్య సౌఖ్యవైభవములు సంఘటిల్లును."

ధర్మనందనుఁడు కుంతీదేవి కారుణ్యభరిత బుద్ధికిని, వసుంధరామరులయందుండు ధర్మనిత్యతకును సంతోషించి, తాను గూడ భీముని బకాసుర సంహారోద్యోగమున నియోగించెను. భీముఁడు తనకుఁ గడుపునిండ నాహారముఁ బెట్టుమని బ్రాహ్మణుని గోర, నతండు ముదమందుచు సమస్త పదార్థములతో భోజనము పెట్టెను. బ్రాహ్మణార్పిత మృష్టాన్నమునుఁ దనివితీరఁ నారగించి భీమసేనుండు సేయనాయితుండై, బహువిధ భక్ష్యభోజ్యాది నానాపదార్థ పరిపూర్ణంబై మత్తమహిషద్వయంబులచే బంధింపబడిన నొక శకటంబు నెక్కి యత్యుత్సాహంబున, పురంబు వెడలి చనియెను.

అతఁడొక యరణ్యమును బ్రవేశించి, కొంత దూరమరిగి, రక్తమాంసంబులచే దుర్గంధ బంధురంబైన బకుని నిలయమును దూరమునుండి దిలకించి, దానిని సమీపింపఁ

నిచ్చుఁగొనక, యచ్చటనే శకటంబునాపి భీషణంబుగా నెలుఁగెత్తి బకుని బిలిచెను. అంతకుముందే యాకలిబాధను తహతహలాడుచు, భోజనముఁ బంపుట కేకచక్రపురవాసు లాలస్యముఁ జేసిరని మండిపడుచున్న యా బకాసురునకు భీముని కేక లద్భుతమందఁజేసెను. ఆతఁడు వెంటనే తన శైలగహ్వరద్వారమునుండి బయలువెడలి దూరమున శకటముపైఁ గూర్చుండి, యందున్న భక్ష్యభోజ్యాదులఁ దినుచున్న భీమునింగాంచి "ఓరీ! నాకుఁదెచ్చిన భోజనమును నీవు తినుచుంటివా!" యనుచు నాతనిని సమీపించి దృఢమ్ముష్టిం బెల్లున వీపుమీద నొక గ్రుద్దు గ్రుద్దెను. భీముఁడావంతయుఁ జెలింపక, యారక్కసుదెస నైనఁ జూడక, పదార్థంబు లన్నియు దిని శకటంబునుండి నేలకు లంఘించి "ఓరీ! మహాక్రూరుఁడవై యేకచక్రపురవాసుల ననుదినంబును జంపుచుంటివి. నేఁడు నీపాలిటికిఁ గాలుఁడనై వచ్చితిని. ఇంక నీయాటలుసాగ"వని పలికి యాదానవుని మార్కొనెను. ఇరువురును గొంతసేపు భయంకరమైన ముష్టియుద్ధ మొనర్చిరి. తుదకు బకాసురుఁడు విగతజీవుఁడయ్యెను. భీముఁడు శైలనిభమైన యాదైత్యుని కళేబరంబు నీడ్చితెచ్చి యేకచక్రపురద్వారముముందుఁ బడవేసి, సదనంబునకేగి యావృత్తాంతము దల్లికెఱింగించెను. అసాధ్యుఁడైన దానవునిఁజంపి తమకు సౌఖ్యముఁగూర్చి

సందులకు, భీముని నకార్యమునందు నియోగించితన పరోప
కార పారీణతఁ బ్రకటించిన, కుంతిని నప్పురజను లనేక విధం
బులఁ గొనియాడిరి.

# 8. భోజుఁడు.

## (రాజ్యప్రాప్తి.)

ధారాపురాధీశ్వరుఁడగు సింధులుఁడుతనకు మరణకాల
మాసన్నమైనదని యెఱింగి తనతమ్ముఁడగుముంజునకు రాజ్యము
నధీనముఁజేసి "తమ్ముఁడా! ఈరాజ్యముతోఁబాటు నా
కుమారుఁడైన భోజునిఁగూడ నీవశముఁజేయుచున్నాను. బాలు
డైన వీనినిరక్షించుభారము నీయది. వేయేల! ఈతఁడు నీ నంద
నుఁడుగా భావింపుము. ఇఁకనేను చెప్పవలసిన దేమియులేదు;"
అని పలికి తనకుమారుఁడైన భోజుని నాతని చేతులయందుఁ
బెట్టెను. ముంజుఁడగ్రజునకు "అన్నయ్యా! నీవుభోజునిగూర్చి
యావంతయుఁ జింతింపవలదు. ఆతని కేవిధమయినకొఱంతయు
గలుగ" దని చెప్పెను.

అట్లు చెప్పిన కొన్నాళ్ళకు సింధులుడు, దివంబలంక
రించెను. ముంజుఁడు ధారానగరాధిపతియై మహాసంతోష
సాగరంబున నోలలాడుచు, నిచ్చవచ్చినయట్లు రాజ్యపరిపాల
నము జేయుచు, నంతకుముందు సింధులునకు ముఖ్య

మంత్రియు, బుద్ధిమంతుడును నగు బుద్ధిసాగరుని, ముఖ్యమంత్రి పదవినుండి తొలగించి యాపని వేఱొకని కొసంగెను. సత్యరతుఁడును, ధర్మపరుఁడును, మహామేధాసంపన్నుఁడునగు బుద్ధిసాగరుని యెడల నట్లు ప్రవర్తించిన ముంజునియందుఁ బ్రజల కసంతుష్టికలిగెను. ఇట్లుండ నొకనాఁడు జ్యోతిశ్శాస్త్ర పారంగతుండగు నొక భూసురుఁడు ముంజుని యొద్దకువచ్చి, జన్మారంభమునుండి నాటివఱకు నాతని చరిత్రము నెఱిం గించెను. ముంజుఁడాతని విద్యామహిమంబున కచ్చెరువుఁ బొంది, బుద్ధిసాగరప్రబోధితుఁడై భోజునింగూర్చి వినఁ దలంచి, యక్కుమారుని రావించెను. భోజుఁడు పినతండ్రి యగు ముంజునకు నమస్కరించి, యొక పీఠమున నాసీనుం డయ్యెను. జ్యోతిష్కుఁడు భోజుని ముఖలక్షణములును, తేజ మును జూచి యద్భుతమంది, ముంజునితో "మహారాజా! ఈ కుమారుని యదృష్టమిట్టిదని వర్ణించుటకు నా కలవిగాదు. అయినను నాకుఁ దోచినట్లెఱింగెదను. ఈతని బాఠశాలకు బంపివేయుఁ" డనెను. ముంజుని యాజ్ఞననుసరించి భోజుఁడు పాఠశాలకేగెను. పిదప జ్యోతిష్కుఁడు ముంజున కిట్లనెను. "రాజేంద్రా! ఆ భోజుఁ డేబదియైదుసంవత్సరములు దక్షిణా పథము నిరంకుశముగఁ బరిపాలించును. ఈతని కీర్తి సకల దిక్కులఁ బ్రకాశించును."

జ్యోతిష్కుని పలుకులు విన్నంతనే ముంజునిముఖంబున నొకవిధమైన చిన్నదనము కలిగెను. కాని, యాతఁడు సంతోషించినవానివలెఁ బలికి, యాజ్యోతిష్కుని సత్కరించి పంపివేసెను.

ముంజుని చిత్తమునఁ గలఁత ప్రవేశించెను. అతఁడు తన చిత్తమున "భోజునిఁగూర్చి జ్యోస్యుఁడు చెప్పినపలుకు లసత్యమగునా! అతఁడు రాజయ్యేనేని నన్నుఁ జూచువా రెవ్వరునుండరు. కావుననే నీరాజ్యలక్ష్మి నాకుఁ దక్కునట్లుగఁ జూడవలయును. ఇందులకాభోజుని నంతమందించుట తప్ప, మఱియొక మార్గమేమియు లేదు," అని తలంచి, వంగదేశాధీశ్వరుఁడును, బలపరాక్రమశాలియునగువత్సరాజుం దోడ్కొని వచ్చుట కొకసేవకునిఁ బంపెను.

వత్సరాజు తన తమ్మునితోఁగూడ ధారానగరంబునకు వచ్చి ముంజునిఁ జూడఁబోయెను. ముంజుఁ డాతనిని బీఠమునఁ గూర్చుండఁజేసి, కుశల ప్రశ్నానంతరమున నెమ్మదిగా నిట్లు పలికెను. "వత్సరాజా! నీవు నాకు విశ్వాసపాత్రుండవగుటచేత నొక కార్యమునందు నిన్ను నియోగింపఁదలఁచి రావించితిని. నీ వా కార్యమును జేసితీరవలయును. నీ వీ రాత్రి భోజుని భువనేశ్వరీ దేవాలయమునకుఁ దీసికొనిపోయి చంపివేయవలయును."

ఈమాట విని, వత్సరాజంతరంగమున "రాజ్యకాంక్షం జేసి ముంజుఁ డిట్టి దుష్కృత్యముఁ జేయ సాహసించినా" డనితలంచి, దానిని వారించుట కాతని కనేకవిధములఁ జెప్పెను. వత్సరాజెంత చెప్పినను ముంజుఁడు వినకపోవుటయేగాక యాగ్రహామున మండిపడియెను. ఇఁక వత్సరాజు మాటడలేక పోయెను. "రాజాజ్ఞ నిర్వర్తించెదఁగాక" యని యాతఁడు పలికి యచ్చటినుండి వెడలెను.

సంధ్యాసమయమున, వత్సరాజు గురునియొద్దనున్న భోజునికడకుఁబోయి "నిన్ను స్వయముగా గృహంబునకుఁ దోడ్కొనిపోవుటకు వచ్చితి" నని పలికి, యాతనిని రథముపై నెక్కించుకొని, వత్సరాజు, తమ్ముఁడుగూడ వెంట నరుదేరసమీపారణ్యమున నున్న భువనేశ్వరీయాలయ మార్గమునఁ బోవుచుండెను. భోజుఁ డనుమానమునొంది "నన్నీమార్గమున నెచ్చటికిఁ గొనిపోవుచుంటి" వని వత్సరాజు నడిగెను. వత్సరాజు బదులుచెప్పలేదు. కొంచెముసేపటిలో వారు భువనేశ్వరీయాలయమును జేరిరి.

భోజునిఁ జంపవలసివచ్చెనుగదా! యని వత్సరాజు విచారించుచునేయుండెను. నిశ్చయముగా నాతఁడు క్రూరబుద్ధిగల వాఁడుకాఁడు. కాని, ముంజునకులోబడియున్న వాఁడగుటచే నాతఁడీదుష్కృత్యమును చేయవలసివచ్చెను. అతఁడు కన్నీరు గార్చుచు భోజునిఁజూచి "భోజకుమారా! నీవు మహారాజువగుదువని

జ్యోతిష్యుఁడు చెప్పుటచేత, ముంజుఁడు నిన్ను జంపవలసినదని నన్ను నియోగించినాడు. ఇట్టికార్యము వలదని నే నాతని కెంతయో బోధించితిని; కాని ప్రయోజనము లేకపోయినది. ఏమిచేయుదు?" నని గద్గదస్వరముతోఁ బలికెను. ఆ పలుకులు విని భోజుఁ డావంతయు నధైర్యముగాని, దుఃఖముగాని పొందలేదు. సుధారస మొలుకు పలుకులతో నాతఁడు "వత్సరాజా! నీవు రాజాజ్ఞను నిర్వర్తించుము. ఇందులకు నీవు చారింపనేల? దైవవిధిదాటుట కెవ్వఁడు శక్తుఁడగును! దేహికి జననమరణములు సహజములు; మరణమునకై నేను భయముందువాఁడగాను. సంసిద్ధముగా నుంటి" నని పలికి, మనంబునఁ బరమేశ్వరుని బ్రార్థించి, తనతొడచీరి, రక్తముతో నొకమఱ్ఱియాకున గడ్డిపోచతో నేదో శ్లోక మొకటివ్రాసి, దానిని ముంజున కిమ్మని వత్సరాజున కొసంగెను.

ప్రాణపరిత్యాగమున కావంతయుఁ జలింపక, యద్భుత తేజంబుతోఁ బ్రకాశించుచున్న భోజునిగాంచి, వత్సరాజుతోఁ దమ్ముఁడు "అగ్రజా! సుగుణ రత్నాకరుండగు నీభోజునిఁ జంపుటకు నీకుఁ జేతులెట్లాడును? సంగరరంగమున వైరివీర కంఠరక్తమున నభ్యంగనకేళి సల్పదగిన నీకృపాణము, నీమహారాజపుత్రుని కంఠముపైఁ బ్రయోగింతువా? రాజ్యకాంక్షం జేసి, ముంజుఁడు క్రూరచిత్తుఁడై నిన్నీకార్యమునందు నియోగించెఁగాక! వివేకవంతుఁడవైన నీవు ధర్మము దప్పి

చరింతువా!" యనెను. తమ్ముని మాటలతో వత్సరాజు చిత్తము మాఱిపోయెను. అతఁడు తమ్మునిఁగాంచి "తమ్ముఁడా! ఈ సుకుమారశరీరుని నెట్లు వధింతునా! యని సంశయించు చున్ననా చిత్తమును నీవాక్యములు పూర్తిగా మార్చివేసినవి. నే నీతనిఁ జంపజాలను. ముంజునితో నేదో యుక్తిఁ బన్నెద" నని చెప్పి భోజునితోఁ "కుమారా! నిన్ను వధింపఁదలంచిన పాపాత్ముఁడ నగు నన్ను క్షమింపు" మని వేఁడుకొని, యాతనిని దన మందిరమునకుఁ దోడ్కొనిపోయి, యెవ్వరికిని దెలియకుండనుంచెను. తిరువాత, నావత్సరాజు ముంజునికడకేగి రాజేంద్రా! నీయాజ్ఞ ననుసరించి భోజుని వధించి, యొరులకుఁ దెలియకుండ, నాతని కళేబరమును భువనేశ్వరీ యాలయ ప్రాంతమునందే పాతిపెట్టితిని. మరణ సమయమున నాతఁ డాకుపై నేదియో వ్రాసి మీకిమ్మని వచించినా" డని చెప్పి, దానినొసంగి, నాతనిచే ననుజ్ఞాతుఁడై యావత్సరా జరిగెను.

వత్సరాజరిగిన పిదప, ముంజుఁడు తనకు భోజుఁడు మఱ్ఱియాకుపై నేమివ్రాసెనోయని చూచెను. అందీశ్లోకము వ్రాయఁబడియుండెను.

శ్లో. మాంధాతాచ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః
సేతుర్యేనమహోదధౌవిరచితః క్వాఽసౌదశాస్యాంతకః

అన్యేచాపి యుధిష్ఠిర ప్రభృతయో యాతాదివం భూపతే
నైకేనాపి సమంగతా వసుమతీసూనంత్వయాయాస్యతి.

తాత్పర్యము:— "కృతయుగమునకు భూషణంబైన మాంధాతమహిపాలుఁడు గతించినాఁడు. సముద్రమునకువారధి గట్టి రావణాసురునిఁ గూల్చిన శ్రీరాముఁడో! యిప్పుడేడీ? ఇతరుల మాట యాలోచింపఁగా ధర్మరాజాదులుగూడ స్వర్గస్థులయిరి. కాని, వారిలో నొక్కరితోను ఈభూమిపోలేదు. ఓరాజా! నీతో మాత్రము వెంటవచ్చును!"

ఆ శ్లోకముఁ జదివి, భావము గ్రహించినయంతనే ముంజుఁడు "హా కుమారా! ఎంతపనిఁ జేసితి"నని మూర్ఛిల్లెను. కొంతసేపటికి లేచి "కుమారా! నిన్ను నీతండ్రి నాకప్పగించినందులకు, రాజ్యకాంక్షం జేసి యిట్టి పాపకార్యమాచరించితి గదా!" యని భోజునిఁ దలఁచి పరిపరి విధముల విలపింప సాగెను. ఎట్లో యాతఁడారేయిఁ గడపెను.

ఆ మఱునాఁడుదయమున ముంజుఁడు సభకుఁ బండితోత్తములయిన భూసురులు మొదలగు వారిని రావించి, భోజుని యెడలఁ దానొనర్చిన మహాపాపకార్యం బెఱింగించి, భోజుఁడు వ్రాసిపంపిన శ్లోకమును వినిపించెను. సభ్యులాశ్లోకమునువిని భోజునిబుద్ధిఁగొనియాడి యాతనిం గూర్చి విలపించిరి. ముంజుఁడు వారిని గాంచి తానొనర్చిన దుష్కృత్యమునకుఁ బ్రాయశ్చిత్త

మేమని యడిగెను. "అగ్నిప్రవేశ మొనర్చుటయే" యని వారు బదులు చెప్పిరి.

ముంజుఁ డగ్నిప్రవేశముజేయ నిశ్చయించి యందులకు దగిన ప్రయత్నమంతయు జేయించెను. భోజునిఁ జంపించి నందులకుఁ బ్రాయశ్చిత్తముగా ముంజుఁ డగ్నిం బ్రవేశించునని విని పురజనులెల్లరు రాజభవనము చుట్టునుమూగిరి. వత్సరాజు మంత్రిశేఖరుఁడగు బుద్ధిసాగరుని చెవిలో భోజుని కుశలమును గూర్చి వెుటింగించెను. బుద్ధిసాగరుఁ డానందమందెను. ముంజు డగ్నిం బ్రవేసించుటకు సంసిద్ధుఁడైయుండెను. అట్టిసమయమున నెక్కడనుండియో యొక యోగీశ్వరుఁడువచ్చెను. బుద్ధిసాగరుఁ డాతనికి నమస్కరించి "మహాత్మా! నీవెచ్చట నుండువాఁడవు? ఎచ్చటికిఁ బోవుచు నిచ్చటి కరుదెంచితివి? నీవేమయిన మహిమలఁ బ్రదర్శింపఁగలవా?' యని యడిగెను అందులకు యోగీంద్రు డిట్లుచెప్పెను. "సర్వసంగమ పరిత్యాగినై పరమేశ్వరుని సేవించుచున్న, నాకు జగమంతయు నివాసమే. నిన్నమొన్న మరణించినవారిని బ్రదికింపఁగల సామర్థ్యమును పరమేశ్వరుఁడు నాకనుగ్రహించియున్నాఁడు." అగ్నిం బ్రవేశింప సంసిద్ధుఁడైయున్న ముంజుఁ డాయోగీంద్రుని మాటలు విని, యాతనిం జేరి, నమస్కరించి "మహాత్మా! నేను రాజ్యకాంక్షంజేసి, నాయన్నకొడుకయిన భోజునిఁ జంపించిన పరమపాతకుఁడ. నాయందుఁ గృపవహించి భోజుని

షజీవునిగాఁ జేయు"మని ప్రార్థించెను. యోగీంద్రుఁడు "రాజా! నీవు చింతింపకుము. నీవొనర్చిన పాపకార్యమునకుఁ బశ్చాత్తాపమందుచుంటివి. కావునఁ బరమేశ్వరానుగ్రహమున భోజుఁడు సజీవుఁడు కాగలఁడు. అందులకై నేను పరమేశ్వరుని ధ్యానింతునని ముంజునకుఁ బలికి, కొంచెముసేపు నిమీలితలోచనుఁడై యుండి, పిదప భోజు నుద్దేశించి "రాజకుమారా! భోజా! సుగుణశాలివైన నిన్నుఁ జంపించినందులకు నీ పినతండ్రియగు ముంజుఁడు-పశ్చాత్తాపమంది, చింతించుచున్నాఁడు. కావున నీవు వచ్చి యీతనికి ముదంబుఁగలుగ జేయు"మనెను. అంతకుముందే వత్సరాజుచే నొకచోట నుంచబడిన భోజుఁ డాక్షణంబున నేవచ్చి, ముంజునకు నమస్కరించెను. అందఱును నాశ్చర్యమందిరి. ముంజుఁ డపరిమితానందమంది, భోజునిఁ గౌఁగలించుకొని, "తా నొనర్చిన దుష్కృత్యమును మఱచిపొ"మ్మని పలికెను. భోజుఁ డాతనియందు భక్తి వినయంబులుఁ బ్రకటించుచుఁ సంతుష్టినందెను. తరువాతముంజుఁడు భోజునకు రాజ్యాభిషేకము గావించెను. బుద్ధిసాగరుఁ డమాత్యుఁడై యుండ, భోజుఁడు ధారానగరసామ్రాజ్యమునుధర్మసంధుఁడై పరిపాలింపఁదొడంగెను.

# 9. చిత్రకేతుఁడు.

తొల్లి శూరసేనదేశమును చిత్రకేతుఁడను రాజు పరిపాలించుచుండెను. ఆతఁడు నిరతుఁడై ప్రజలను గన్నబిడ్డలచందమునఁ గాంచుచు రాజ్యమేలుచుండెను. సద్గుణములన్నియు నాతనియొద్దఁ బ్రోవుగాఁ జేరియుండెనని చెప్పవచ్చును. ఆతనికిఁ బెక్కండ్రు భార్యలుగలరు. ఆతని సంపద కుబేరుని మించియుండెను. ఏవిషయమున నాతనికి గొఱంతలేదు. కాని వంశముద్ధరించు పుత్రుఁడు లేకపోయెనను చింత యాతని మనంబును వేధించుచుండెను. ఇట్లుండ నొకనాడాతని మందిరమునకు నంగిరసుఁడను మునీంద్రుఁడు వచ్చెను. చిత్రకేతుఁడాతనిని బహువిధములఁ బూజించెను. అంగిరసుఁడు, చిత్రకేతుఁడు చింతాక్రాంతుఁడైయుండుట గ్రహించి యందులకుఁ గారణమడిగెను. నృపాలుఁడు తన చింతకుఁ గారణం బెఱింగించుటకు సిగ్గుపడి తలవంచుకొనియుండ, నంగిరసుఁడు దానిని దన దివ్యదృష్టి నెఱింగి "రాజేంద్రా! నీవు సంతానముకొఱకుఁ జింతించుచున్నావు. ఇఁక నీ వా చింతవిడువుము. నీజ్యేష్ఠభార్యయం దొక పుత్రునిఁ బడయఁ గలుగుదు", వని యొక ఫలమునిచ్చి దాని నామెకిమ్మని చెప్పి యరిగెను.

చిత్రకేతుఁడు ముదమందుచు నాఫలంబును దన పెద్దభార్యయగు కృతద్యుతి కిచ్చెను. ఆమె యాఫలమును భుజించి

కొన్నాళ్ళకు గర్భము ధరించి, సుముహూర్తముననొక కుమారునిం గనెను. పుత్రోదయమునకుఁ జిత్రకేతుఁ డెంతయో సంతోషించెను. రాజునకు నందనోదయమైనదనితమ సంతోషమును సూచించుటకుఁ బురజను లెల్లరును దమగృహములను దోరణంబులచే నలంకరించిరి. చిత్రకేతుఁడు కుమారునకు జాతకర్మాదిక్రియలు నిర్వర్తించి యనేక బ్రాహ్మణులకు వివిధ దానంబులు జేసెను. కుమారుఁడు శుక్లపక్ష చంద్రుని వలె దినదినాభివృద్ధినందుచుఁ దల్లిదండ్రులకు సంతోషముఁ గూర్చుచుండెను.

కృతద్యుతి కుమారుని గాంచిననాటనుండి, చిత్రకేతు డామెయందే యెక్కువ యనురాగము కలిగియుండెను. కృతద్యుతియందు నందనోదయమగుటచేతనే రాజేంద్రుఁ డామెయందు బద్ధానురాగుఁడై యుండెనని యామె సవతు లసూయవహించి, సమయముఁ జూచి యక్కుమారునకు విషంబిడిరి. విషముఁ దాగిన యాబాలుఁడు శయ్యయందే మృతినందెను. మృతుండైన పుత్రునిఁజూచి కృతద్యుతి యనేకవిధంబుల విలపించెను. భార్యకంటె నెక్కుడుగఁ జిత్రకేతుఁడు విలపింపదొడంగెను. మంత్రులు మొదలగు వా రెంత చెప్పినను నాతఁడు దుఃఖ మాపుకొనఁజాలఁడయ్యెను. ఆసమయమున, నతనకిఁ బుత్రుని బ్రసాదించిన యంగిరసుఁడు వచ్చి యిట్లు పలికెను.

"సీ. నీకు వీఁ డెవ్వఁడు ♦ నీ వెవ్వనికి శోక
సంతాపమందెదు ♦ సార్వభౌమ
పుత్రమిత్రాదులు ♦ పూర్వజన్మంబున
నెవ్వనివారలో ♦ యెఱుఁగవలదె
మొదల నదీవేగ ♦ మున నాడకాడను
సికతంబుఁ గూడుచుఁ ♦ జెదరుచుండు
నారీతిఁ బ్రాణుల ♦ కతికాలగతిచేతఁ
బుట్టుట చచ్చుట ♦ పొసఁగుచుండు
ఆ. గాన భూతములకుఁ ♦ గలుగు భూతంబులు
మమతతోడ విష్ణు ♦ మాయఁ జేసి
దీని కడలనేల ధృతిఁ ♦ దూలఁగా నేల
బుద్ధిఁ దలఁపవలదె ♦ భూతసృష్టి."

"రాజా! నీ వెవ్వనినిమిత్త మిట్లు విలపించెదవు? మృతుండైన యీకుమారుఁడు పూర్వజన్మమున నీ కేమగును? చావుపుట్టువులు మానవులకు సహజములు. నీవు విచారించినందువలనఁ బ్రయోజనము లేదు."

ఇట్లు పలికి యమ్మునీంద్రుఁడు మృతబాలకుని కళేబరమును సమీపించి "జీవుఁడా! నీమరణమును జూచి తల్లిదండ్రులు మిగుల శోకించుచున్నారు. నీవు కళేబరంబున మరలఁ బ్రవేశించి, వీరికి సంతోషముఁ గూర్చి పితృపితామహార్జితమై

భాగ్యమునకును, రాజ్యమునకును నధిపతివై సుఖంబులనందు మనిపలికెను. మునీంద్రుని మాటలువిని యాకళేబరమున నున్న జీవుఁడు "ఓతాపసోత్తమా! ఎన్నోజన్మములందుచున్న నాకుఁ బూర్వజన్మమున వీరేమగుదురో తెలుపఁగలవా! జీవునకు వావియనునది యేమికలదు? జననీజనక పుత్రకళత్రాదుల సంబంధ మంతయు మాయాకల్పితము. వీరు నాకొఱకు శోకించుట వెఱ్ఱితనము.

"క. సతులెవ్వరు సుతులెవ్వరు
పతులెవ్వరు మిత్రశత్రు ♦ బంధుప్రియ సం
గతులెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షియైన ♦ ఘనుఁడొక్కనికిన్."

అనిపలికి, యా కళేబరమునుండి జీవుండు వెడలి పోయెను. చిత్రకేతుఁడు మునీంద్రునివలన దివ్య జ్ఞానోపదేశమును వడసి, దుఃఖమును విడిచి, కుమారునకుఁ బ్రేతకృత్యములు నిర్వర్తించి, విరాగియై సంసారమును విడిచి, కాళిందీ నదీతీరమునకేగి నిశ్చలచిత్తుఁడై భగవంతునిఁ గొలుచుచుండెను. కొన్నాళ్ళకు శ్రీహరి యాతనికి సాక్షాత్కరించి యొక దివ్యవిమానమునిచ్చెను. విమానమును వడసిన చిత్రకేతుడు, హరిని భజించుచు మూడులోకములఁ జరించుచుండెను. ఒకనాడాతఁడు పరమేశ్వరునిఁ జూడఁ

గైలాసమునకుఁ బోయెను. ఆసమయంబున శంకరుఁడు, పెక్కుమంది మునిపుంగవులచేఁ బరివేష్టింపఁబడి, పార్వతి నంకతలమునఁగూర్చుండఁబెట్టుకొని పీఠమున నాసీనుఁడై యుండెను. చిత్రకేతుఁ డందులకునవ్వుచు "జగత్కర్తయైన యీతఁడు మహాదేవుఁ"డని పేరొందినాడు. అట్టివాఁడు లజ్జవిడిచి యిట్లు మునుల సన్నిధినున్నాఁడు. సకలధర్మములు తెలిసిన యీతఁడే యిట్లున్నఁ దక్కినవారి మాటఁజెప్పనేల, "యని పరిహాసించుచుఁ బలికెను.

ఆపలుకుల కీశ్వరుండేమియు మాటలాడలేదు కాని, జగన్మాతయగు పరమేశ్వరి కాగ్రహ మొదవెను. ఆమె కోపదృష్టితోఁ జిత్రకేతునిఁజూచి యిట్లనెను. "పరమయోగీంద్రులుగూడ దేవదేవుఁడైన పరమేశ్వరుని చర్యలఁ బ్రశంశించుచుందురు. అట్టిచో నీవీతనిని బరిహాసముఁ జేసితివి. ఈశ్వరదూషకుండవగు నీవు శ్రీమన్నారాయణుని యనుగ్రహామున కెట్లు పాత్రుఁడవైతివో కదా! పూజ్యుండగు నీశ్వరునిఁ దిరస్కరించిపలికి నందులకు ఫలముగా నీవు దనుజుఁడవై జన్మింతువుగాక."

పార్వతి యిడిన శాపమునకు భయమంది చిత్రకేతుఁ డామె చరణములపైఁబడి రక్షింపుమని బ్రదిమాలెను. తరువాత నాతఁడు వృత్రుఁడను రాక్షసుఁడై జన్మించి, మహేంద్రుని చేఁజూలి మోక్షము నందెను.

# 10. హంపీక్షేత్రము-అందలి శిథిలములు.

బళ్ళారి మండలమున హాసపేట యను పట్టణమునకు సుమారెనిమిదిమైళ్ళ దూరమున హంపి యను పుణ్యక్షేత్రము కలదు. అందు, కమనీయమై, మధురజలపూరితమైన పర్వతపార్శ్వములనుండి జలజలస్వనముతో పారుచుండు తుంగభద్రానదీతీరప్రాంతంబు పరమపావనంబైనది. భగవత్ స్వరూపుడును, రామాయణ కథానాయకుండును నగు శ్రీరామచంద్రుని పాదకమలములు సోకిన పవిత్రస్థానం బిదియే. ఇయ్యది రామాయణకాలమందు కిష్కింధ యను పేర బరగుచుండెను. సీతాన్వేషణుడై, శ్రీరామచంద్రుడు కిష్కింధప్రాంతమున గ్రుమ్మరుచు, సుగ్రీవాదులగు వానర ప్రముఖులతో సఖ్యముచేసి, బాహుబల గర్వోపేతుండగు వాలిని గూల్చి, సుగ్రీవునకు పట్టముగట్టి, యంజనీతనయుండగు హనుమంతునకు తన ముద్రికనిచ్చి, లోకమాతయగు సీతాదేవిని వెదకంబంపిన మహాస్థలం బిదియే. రామాయణమందు జెర్కొన్న మాల్యవంతము, పంపాతీరము, హేమకూటము, ఋశ్యమూకము, మతంగపర్వతము మొదలుగాగల పవిత్రస్థలము లిప్పటికిని యదే నామధేయంబులతో నీ పుణ్యభూమియందలరారు చున్నయవి. క్రీ. శ. పదునాల్గవ శతాబ్ద యారంభమున, పరమజ్ఞానవేత్తయగు విద్యారణ్యస్వాములు లక్ష్మీని

గూర్చి తపంబాచరించి, సంతత లక్ష్మీప్రసన్నమగు పురమున తాను శాశ్వతకీర్తితో వసించుటకు వరముపొందినస్థలంబిదియే.

క్రీ. శ. 1327 వ సంవత్సరమున ద్వారసముద్రమునందు హోయసలరాజ్యము క్షీణించిన తరువాత నచ్చట యాస్థానమందున్న హరిహరరాయలు, బుక్కరాయలు నను నిద్దరు సోదరులు ఉత్తరదిశగా వెళ్ళి తుంగభద్రానది దాటి యచ్చటనుండు నానెగొంది సంస్థానాధిపతికడ మంత్రిగను, కోశాధికారిగను యుండిరి. ఒక దినము హరిహరరాయలు వేటాసక్తుడై తుంగభద్రానదిని దాటి యావలనుండుయడవులయందు వేటాడజొచ్చెను. అతఁడు, శార్దూలాది క్రూరమృగము లనేకములను జంపి, మరలి వచ్చుచుండ పొదలలో డాగియున్న నొక శశరాజ ముందు కలిగిన కోలాహలమునకు బెదరి రాయల కడ్డముగా పరుగెత్తుచు వేటకుక్కలచే తరుముబడెను. అది కొంత దవ్వునకు పరుగిడి, గిరుక్కున వెనుకకు దిరిగి వేటకుక్కల నెదిరించెను. వ్యాఘ్రములకు సహితము నెదుర్కొననలవికాని యా వేటకుక్కల నొక్క కుందేలు ధిక్కరించెను గదా యని హరిహరరాయ లచ్చెరువంది యావృత్తాంతమును తన గురువగు విద్యారణ్యుల కెరింగించె. అతఁడది యాస్థల మహాత్మ్యంబనియు, నచ్చట నభేద్యంబగు నొక కోటను, పురమును నిర్మించి పరిపాలింపుమని యాజ్ఞనిచ్చెను. హరిహరరాయ లతని యాజ్ఞానుసారము, కొండల మధ్యనుండు నీ

ప్రాంతమున నొక బలిష్ఠమైన కోటనుగట్టి, తుంగభద్రా నదీ తీరమున విశాలమగు వీధులతోను, కనకకలశాలంకృతమై గగనవీధులు నిక్కి చూచుచున్నవో యన, దివ్యరాజ సౌధముల తోను, రమ్యహర్మ్యంబులతోను, వేదవేదాంగముల నభ్య సించు విద్యాపీఠములతోను, మనోహరంబై నానాసుగంధ పుష్పిత తరులతాగుల్మయారామ సీమలతోను, స్ఫటికశిలా నిర్మితంబగు సుందర సరోవరములతోను, శిల్పకళానైపుణ్య మునుఁ జాటు దేవాలయములతోను, రాజస్త్రీ సఖీజనసేవా బృంద వాసకాసారములతో నొక పురవరంబు నిర్మించి, సంతత గురుపదాబ్జ సేవావ్రతుండు గావున, దానికి తన గురువరేణ్యు డగు విద్యారణ్యుని పేర 'విద్యానగర' మని నామంబిడెను. ఈ నగరరాజమును నిర్మించుట కెనిమిది వత్సరములుపట్టెనని తెలియుచున్నది.

హరిహరరాయలు సుగుణసంపన్నుడై న్యాయవర్తనుడై పరిపాలించి, క్రీ. శ. 1343 వ సంవత్సరమున గతించెను. తరువాత నతని తమ్ముడగు బుక్కరాయలు రాజ్యభారము వహించి చేరువనున్న మహమ్మదీయరాజులతో పోరుచు, రాజ్యమును వృద్ధిపరచెను. ఇతని తరువాత రెండవ హరిహర రాయ లనునతడు, 'మహారాజాధిరాజ,' యను బిరుదాంకిత మున సింహాసనమెక్కెను. ఇతడు క్రీ. శ. 1404 వరకు రాజ్యము చేసి దక్షిణమున మైసూరు, కంచి, చెంగల్పట్టు, తిరుచనా

పల్లి వరకు రాజ్యము విస్తరింపజేసెను. ఇతని యనంతరము వచ్చినరాజులలో రెండవ దేవరాయ లిరువదియేడు వత్సరములు (క్రీ. శ. 1421 మొదలు 1448) రాజ్యము చేసెను. ఇతనికాలమున విదేశరాయబారు లితనియాస్థానమునకు వచ్చిరి. 1443 వ సంవత్సరములో పరిష్యాదేశపు రాయబారి యగు 'అబ్దుల్ రజాకు' అనువాడు విద్యానగర వైభవమును గూర్చి యిట్లువర్ణించెను: "విద్యానగరము వర్ణనాతీతమైనది. లోకమునందు దీనికి సమానమైన పట్టణమును మానవుడు విని గాని, కనిగాని యెరుంగడని నానమ్మకము. ఏడుప్రాకారములు గల యేడుకోటగోడలతో నీపురము నిర్మింపబడినది. మొదటి కోట ప్రాకారమునందు రాళ్ళు మనుష్యునికన్న నెత్తైనవి. అవి సగముభూమిలోనికిదింపబడి మిగిలినసగము పైకిక నపడు నటుల నొకదానిప్రక్క నొకటి యమర్పబడియుండుటచే నెట్టి గుఱ్ఱపురౌతుకుగాని, సైనికునికిగాని, యభేద్యమైనది. మొదటి ప్రాకారమునకును, రెండుమూడు ప్రాకారములవరకుగల మధ్య విడిస్థలమందు పొలములు,యిండ్లు, తోటలుకలవు.మూడవప్రాకారమునుండి యేడవ ప్రాకారమువరకుగల మధ్య ప్రదేశమున యనేక దుకాణములతోను, జనసమూహములతోను నిండిన బజారుయున్నది. రాజనగరువద్దనాలుగు బజారు లెదురెదురుగా నున్నవి ఉత్తరపుదిక్కున రాజుగారి వాసస్థానమున్నది. ప్రతి బజారువద్ద నెత్తైన సుందర విహారస్థలము లున్నవి. కాని

రాజుగారి యాస్థానమంటప మన్నిటికంటె యెత్తైనది. బజారులు మిక్కిలి నిడివిగను, విశాలముగను యున్నవి.

పుష్పము లెచ్చట చూచినను అమ్మబడుచున్నవి. ఈ పురజనులకు తమ జీవనమున కాహార మెంత యవసరమో పూవులుగూడ యంతయవసరమున్నట్లున్నది. వేర్వేరువృత్తుల నాచరించు వర్తకుల యంగళ్ళు యొకటి నొకటి యానుకొని యున్నవి. నగలమ్మువారు, బజారులో బహిరంగముగా ముత్యములు, మాణిక్యములు, పచ్చలు, వజ్రములు నమ్ముచున్నారు. ఇట్టి మనోహరమగు స్థలమునందును, రాజ నగరుయందును చక్కగా రాతితో చెక్కబడిన కాలువ లనేకములగుండ నీరెడతెగక పారుచుండును. రాజనగరువెనుక 'ధనాయక్' కు నియమించిన గృహమును, హాలును యున్నవి. ఎడమవైపున టంకశాలయున్నది. ఈరాజ్యమున నుండు జనసంఖ్య యింతయని చెప్పుట సులభమైన పనిగాదు. రాజనగరుయందు తొట్టివలె కట్టబడియుండు చిన్నగదు లనేకములు గలవు. ఇవి కరగింపబడిన బంగారుముద్దలచే నింపబడియున్నవి. ఇచ్చట జనులందరు బీదలు, భాగ్యవంతులనక బంగారువస్తువులగు సొమ్ములను, చెవులయందును, మెడలయందును, భుజములందును, మణికట్ల యందును, వ్రేళ్ళయందును ధరింతురు. రాజుగారి సింహాసనము కడు గొప్పది; కనకమయమై యమూల్యమైన రత్నములతో చెక్కబడియున్నది

విజయనగర సామ్రాజ్యలక్ష్మి దినదినప్రవర్థమానమై సకలసంపదలతో నిండి తులతూగుచుండెను. కాలక్రమమున ప్రఖ్యాతిగాంచిన కృష్ణదేవరాయలు విజయనగర సింహాసన మధిష్ఠించి, దిగంత యశోవిశాలుడై, సద్గుణ సంపన్నుడై, రిపుజనకభీకరుడై, సంగ్రామశూరుడై, కవిజనపోషకుడై, పండిత పామరుడై, ప్రజానురంజకముగా 1509 మొదలు 1529 వరకు రాజ్యముచేసి, పెక్కురాజ్యములను జయించి, మహమ్మదీయ రాజుల యుక్కడించి, పోర్చుగీసువారితో సఖ్యమొనర్చి, సామంత రాజులచే కప్పములందుచు, జగన్నుతకీర్తితో పరిపాలించెను. ఇతని కాలమందు విజయనగర మింకను దేవాలయములతోను, ఉన్నతప్రాసాదములతోను, జలక్రీడా భవనములతోను, మనోహరములగు. నుద్యానవనములతోను. చెలువొప్పారుచుండెను గజతురగపదాతుల సమూహముతో నిండిన గొప్పసైన్యము వీరియొద్దనుండెను.

ఇతని కాలమందే ''యష్టదిగ్గజము''లను కవీశ్వరు-లుండిరి. వీరిలో మనుచరిత్రమును రచించిన అల్లసానిపెద్దన యాస్థాన పండితుడుగా నుండెను. కృష్ణదేవరాయల యనంతరము విజయనగర రాజ్యమునందు కలతలు సంభవించి, తుదకు రామరాజుయొక్క పొగరుపోతుతనముచేతను, దుష్కృత్యముల చేతను, మహమ్మదీయరాజులు సఖ్యభావము మాని, యేకమై 1565వ సంవత్సరమున తాళికోటవద్ద జరిగిన

ఘోరరణమునందు రామరాజును వధించిరి. సకల సంపదలచే విరాజిల్లుచున్న విద్యానగరము మహమ్మదీయుల దురాగ్రహము పాలై వినాశము నొందెను. ఈపట్టణమును కొల్లగొట్టుటకును, నాశనము చేయుటకును మహమ్మదీయులకైదు మాసములుపట్టె నని తెలియుచున్నది. ఖడ్గములతోను, యినుప గుదియముల తోను, తదితరాయుధములతో నొకక్రొట్టిగా పట్టణనాశము గావింపబడియు, మహమ్మదీయుల కోర్కెధాగ్నికి దక్కి నిలచిన దేవాలయములు, కట్టడములు, భవనములు, రాజవీథులు నేటికిని శిథిలావస్థయందున్నవి. ఈ శిథిలములు చూచినవారికి మనస్సంతాపము కలుగకమానదు. రాజ్యలక్ష్మి యెంత చంచలమో యీశిథిలములే వేనోళ్ళ ప్రకటించుచున్నవి.

## దే వా ల య ము లు.

1. "హజారరామస్వామిదేవాలయము" కోటగోడలయం దున్నది. దేవాలయములోని శిల్పిచాతుర్యము వర్ణించుట కలవిగాదు. గోడలపై రామాయణము చిత్రరూపముగ చెక్క బడియున్నది. ఈదేవాలయముర 1518 న కట్టబడినది. దేవాలయమున విగ్రహములేదు. నాశనము కాబడినది.

2. "పంపావతీ దేవాలయము." చక్కగానే యున్నది. ఈ దేవాలయములో ముందుభాగమున రాతికాలువలగుండ నీరు పారుచుండును. గర్భగుడికి పోవు మంటపముదగ్గర కృష్ణ

దేవరాయలపేర నొక శిలాశాసన మున్నది. ఈ దేవాలయమున చిన్నగుడులు గలవు. దీనిలో ముఖ్యమైనది గురిగింజమాధవుని దేవాలయము. ఏకారణముచేతనో పంపావతి దేవాలయము మహమ్మదీయులచే నాశము గావింపబడలేదు. ఇప్పటికిని యిచ్చట గొప్ప వుత్సవములు జరుగును. ఈ దేవాలయమునకు ముందు విశాలమైన వీధియున్నది. ఇందు శిథిలములైన రాతి మంటపము లున్నవి. ఇచ్చట యిప్పుడు యాత్రికుల సౌకర్యములకొరకు చిన్న యంగళ్ళేర్పడినవి.

3. "ఖడ్లికాళు (సెనగగింజ)" అనుగణపతిదేవాలయము పంపావతి దేవాలయమునకు కుడిప్రక్కన యెత్తైన ప్రదేశము నందున్నది. ఇందులోనిగణపతివిగ్రహ మొకేరాతియందు చెక్కబడి దాదాపు 16 లేక 17, అడుగుల యెత్తుండును. మహమ్మదీయులకు దీని నెక్కువ భిన్నముచేయుటకు వీలుకానట్లున్నది. దీనిపొట్ట మాత్రము చెక్కబడియున్నది. ఇప్పుడీ దేవాలయము గబ్బిలముల కునికిపట్టైయున్నది. ఇంతగొప్ప విగ్రహము హాస్యభావముగా సెనగగింజ గణపతియని వాడుక యందున్నది.

4. "సాశివుకాళు (ఆవగింజ)" అను గణప్ప దేవాలయములోని విగ్రహమును, గొప్పదేకాని, పైనచెప్పినదానికన్న చిన్నది. అందందు భిన్నమైనది.

5. "క్రిష్ణ దేవాలయము" జీర్ణస్థితియం దున్నది. దానిలోపల విగ్రహము లేదు. ప్రాకార గోడలుపడిపోయి పోటీలచే నిలువబడియున్నది.

6. "విఠలస్వామి దేవాలయము" వుత్తరదిక్కుగా పంపావతీ దేవాలయమునకు రెండుమైళ్ళ దూరములో తుంగభద్రా నదియొద్దున నున్నది. ఈదేవాలయము మహమ్మదీయులు నాశన మొనరించునప్పటికి పూర్తియైనట్లులేదు. ఇందు శిల్పకళా నైపుణ్య మత్యద్భుతము. దేవుని కళ్యాణమంటప మతిసుందర మైనది. వసారామంటపములో నొక్కొక్క రాతిస్తంభము నందు పదియారు చిన్నస్తంభములు తొలచబడి యవి కంచు వ్రాగునట్లు వివిధనాదములతో మోగును. ముందుప్రాకారమునందు రాతిరథ మొకటి యొకేశిలయందు నిర్మింపబడి యున్నది.

(7) "జైనదేవాలయములు" జైన మతస్థులకొరకు కట్టబడినవి. విజయనగరరాజులు జైనమతస్థులనుసహితము, గౌరవము చేయుచుండురని దెలియుచున్నది.

(8) "పాలూాళ దేవాలయము" యిటీవల త్రవ్వి కని పెట్టబడినది. గోడలపైన భూమి యాక్రమించిన మట్టము చక్కగా కనబడును. ఇది శివాలయము. ఇందు లింగమునకు సదా తుంభద్రానదినీరు కాలువద్వారా యభిషేకమగు నట్లేర్పాటు చేయబడియున్నది.

## ఇ త ర శి థి ల ము లు .

(1) కోటప్రాకారముల గోడలు శిథిలములై నిల్చియున్నవి. అందురాళ్ళు అబ్దుల్ రజాకు వర్ణించిన రీతిగనే యున్నవి.

(2) "రాణిగారి యష్టకోణపు జలక్రీడా భవనము:" గచ్చుతో నష్టకోణాకారముగ రమ్యముగా కట్టబడినది. కట్టడపు మధ్యనొక సరోవరమున్నది. నాల్గువైపులనుండి సరోవరములో దిగుటకు మెట్లున్నవి. దీనికి నీరు తుంగభద్రానది నుండి కాలువలద్వార విడువబడుచుండును. జలక్రీడానంతరము యానీరు బయటకు పారుటకు కాలువలుగలవు.

(3) "రాజుగారి యాస్థానమంటపము" యెత్తైన సమముగనుండు విశాలప్రదేశము. పైకట్టడము పోయినది.

(4) "రాజదాన తులా": ఇందు రెండురాతి స్తంభములు నిల్పి దాని కడ్డముగా మరియొక రాతిదూలము వేయబడినది. గొప్పకార్యములందును, పండుగలయందును రాజుగారు తన యెత్తు బంగారును, ధనమును, నవరత్నములు దానము జేయుచుండెనట.

(5) "టంకశాల" ఇది చాల శిథిలావస్థలో నున్నది. కట్టడపు పునాదులుతప్ప వేరొండు గానరాదు.

(6) "రాజుగారి కార్యాలోచన భవనము": ఇది కడూ సొంపైనది. పాలగచ్చుతో కట్టబడినది. మేడకు పోవుటకు మెట్లున్నవి.

(7) "ఏనుగుల శాల": ఇది రాజుగారి సుదకరీంద్రము లుండు స్థలము. ఈ కట్టడము యొత్తైనది.

(8) "ఏనుగులు నీరుత్రాగు తొట్టి": ఇది యొకచోట వరిగి పడియున్నది. దాదాపు మూడడుగుల వెడల్పును, యిరువదిరెండడుగుల పొడవును, రెండున్నరడుగుల యెత్తును గలిగి యొకే రాతియందు తొల్చబడియున్నది.

(9) "నరసింహ విగ్రహము": ఇది యొక గొప్పవిగ్రహము. చెరుకుతోటల మధ్య నిల్చియున్నది.

(10) "లింగము" ఒంటిరాతిచే చేయబడినది. కడూ గొప్పది.

(11) "సహగమనము సూచించురాళ్ళు": ఈ రాళ్లు పెద్దమైలు రాళ్ళంత యాకారము గలిగియున్నవి. ఈరాళ్ళ పైన పురుషవిగ్రహ మొకటి, స్త్రీవిగ్రహ మొకటి, లేక రెండుండును. అనగా నొక్కొక్కప్పుడు తమ భర్తయనంతరము యిద్దరు భార్యలుకూడ సహగమన మొనర్చిరని యర్థము. ఇవి చూచుటకు కడు విషాదము కలిగించును.

12. "సూళిబీది" అనగా పణ్యాంగనలవీధి. ఇందు జీర్ణ శిథిలములు మాత్రి మున్నవి. వీధి విశాలముగా నున్నది. ఇవిగాక అబ్దుల్‌రజాకుచే వర్ణింపబడిన రాతికాలువల శిథిలము లందందు నిల్చియున్నవి. మాల్యవంతగుట్టపైనను, తుంగాభద్రానదీతీరమునను, చక్రతీర్థమనుచోటను, శ్రీరాముల వారి దేవాలయము లున్నవి.

ఇట్టి మహాక్షేత్రమును, చరిత్రాత్మకమైన స్థలమును ప్రతిమానవుడును చూచియే తీరవలయును. చరిత్ర బోధించు ప్రతి యుపాధ్యాయుడును తమ బాలురను ముఖ్యముగ నిచ్చటకు దీసికొనిపోయి వింతలువిశేషములుచూపి దేశచరిత్రియం దభిరుచి కలుగ జేయవలయు.



# ఆర్యకథాలహరి.

2, 3, 4, 5, 6, 7, 8 తరగతులకు.

ఇందలి కథలు బాలురకు సుఖబోధకమగురీతిని తేట మాటలతో నాయా తరగతుల కనుగుణ్యముగ వ్రాయఁబడి యున్నవి. ఇందు వాడఁబడిన కథలు విద్యార్థుల హృదయంబుల దేశాభిమానదైవప్రభు భక్త్యంకురముల జక్కఁగ నాటెలఁజేయ సమర్థములై యొప్పుచున్నవి. ఇయ్యవి విద్యావిధానమునం దెక్కుడనుభవమును, వైదుష్యమును గలిగినవారిచే విరచింపఁబడినవి. ఈ కథలు శైలియందును, వస్తుస్వీకరణమునందును రమ్యములై కన్పట్టుచున్నవి. ప్రాథమిక పాఠశాలల విద్యార్థులు మొదలు, అయిదవ ఫారము బాలురవరకు మిక్కిలి యుపయోగకరములై యొప్పుచున్నవి.

| | | |
|---|---|---|
| ఆర్యకథాలహరి | మొదటి భాగము | 0—2—0 |
| ,, | రెండవ భాగము | 0—2—6 |
| ,, | మూడవ భాగము | 0—3—0 |
| ,, | నాల్గవ భాగము | 0—4—0 |
| ,, | అయిదవ భాగము | 0—5—0 |
| ,, | ఆరవ భాగము | 0—6—0 |
| ,, | ఏడవ భాగము | 0—8—0 |

వలయువారు :— రామా అండ్ కో.,

తర్లపాడు, (నెల్లూరుజిల్లా).

